శ్రీరస్తు.

# నలుగురుమంత్రులకథలు.



చెన్నపురి:

వావిళ్ల. రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ వారిచే

ప్రకటితము.

1925



శ్రీ ర స్తు.

# నలుగురుమంత్రుల కథలు.

---

చతుస్సముద్ర వేలావలయితంబగు నీభూతలంబున నష్టదిక్పాలపురవందనీయంబగు అలకాపురంబను ఒకరాజధాని యలరుచుండును. ఆ ప్రోలియొప్పిదం బెట్టిదనిన? చంద్రకాంతశిలాస్థగితంబు లగు మేడలు తరంగంబులుగా సువర్ణమయంబు లగు వేదులిసుకతిన్నెలుగా నెలబ్రాయంపు సువాసినీసముదయంబులు ప్రవాళలతలుగా మదధారావచ్ఛిన్నంబు లగు కరులు గిరులుగా చిత్రవర్ణంబులగు వారువంబులు రత్నరాజిగా సమస్తసంపదల కాలయంబై పాలమున్నీటి వెన్నుదన్ని నెగడుచుండు.

మఱియు నప్పురంబున, పద్మజుండు చతుర్ముఖంబులం జదివిన యాగమశాస్త్రంబు లెల్ల మే మొక ముఖంబునం బఠించితిమిగాన అతం డస్మత్సదృశుండు గాఁ డని పల్కు ద్విజశేఖరుల మొత్తంబులును, సాక్షాత్సాంబుఁడు తృతీయంబగు నేత్రంబు విచ్చి యెదిరి మార్కొనినను బోరిగొందుమను నరా

ధిపపుత్ర సంఘంబులును, నవనిధులును, ఈశ్వరసఖిత్వంబునుం గలదని నిక్కు కుబేరుని ధనం బంతయు మాభొక్కసంబులచుట్టును చెదరి పడియుండెడు. నానాంబులకు సరికాదనిపల్కు వణిక్సమూహంబును, సురాపానమత్తుండై కృషియొనరించు వగ నెఱుంగక సీరంబు భుజంబున మోచి తిరుగుహాలధరుని కృషిగోరక్షణసమర్థులమగు మాకు సరిపోల్పం దగునా యని పరిహాసం బొనర్చు కర్షకులును, వనజజుం డీ లోకంబునం గల మెఱుంగువస్తువు లెల్లం జేర్చి యొనర్చిన బొమ్మలుకాంబోలునని యెన్నందగిన వారసుందరీసముదయంబును, వారవనితల మారుకేళి నేమరించి ముద్దులంగొను పల్లవులగుములును, పెంపులగు రతనంపునగలతొగలు గలిగి పాలంబులం బిట్టలందోలు నెపంబున నెట్టసి విటకాండ్రం జంకించు దుటారంపుకాపుపడుచుల గుంపులును గలిగియొప్పు. అప్పట్టణంబు గురు దేవ భూసురా ద్యర్చనాతత్పరుండును, దానధర్మనిరతుండును, సత్యవాక్యప్రవీణతాధురంధరుండును నై, యోగవిద్యా విచారంబునం బ్రొద్దులు పుచ్చుచు శ్రీరామచంద్రకీర్తి సదృశకీర్తియుక్తుండై అలకేశ్వరుం డనునభిధానంబునం బ్రసిద్ధుండై వ్యాఘ్ర గోమాయు మార్జార మూషకంబు

లాదిగాఁగల విరుద్ధజంతువులన్ని యుఒకటితో నొకటి సఖ్యంబునం గ్రీడలాడుచు ఏకనదీజల పానంబును, ఏకస్థలనివాసంబునుంగాఁ దనధర్మంబు నెగడ పాలిం పుచుండెను. అట్టికాలంబున అప్పురంబునగాపురం బుండు నొక వైశ్యోత్తముండు స్వవ్యాపార భారవహా నార్థంబుగా నొక లొట్టిపిట్ట నుంచుకొని యుండఁగా నాయొంటె యొకనాడు తప్పించుకొని యెక్కడనో కనుపడక పోయినందున, ఆవణిగ్వరుం డొక నెల సిందుపర్యంతము పూర్వ దక్షిణ పశ్చిమోత్తరాది వ్యవహారంబులఁ బ్రసిద్ధంబులగు చతుర్దిక్కులయం దును వెదకి యెందునుంగానక తనపురంబునకు మఱలి వచ్చుచుం త్రోవ కనతిదూరంబున మధు రాపురంబను నొక రాజధానిం బాలింపుచుండు మధురేశాభిఖ్యుండగు రాజసముఖంబున బోధా దిత్య, బోధచంద్ర, బోధవ్యాపక, బోధవిభీషణు లను నామంబుల నలువురు మంత్రులుగలరు. వార లారాజునొద్ద నతిప్రీతులై యుండియు, అవ మానగ్రస్తులై అంత నచ్చట నుండుట కిచ్చలేక యెచ్చటికేనియుఁ బోవ నిచ్ఛగలిగి యానసన్నద్ధు లయి మార్గమునుఁబట్టి పోవుచుండగా నాత్రోవ కడ్డముగా నొకలొట్టిపిట్ట చనిన జాడ గని వార లా

కరినొకరు చూచి నవ్వుకొనుచు పోవువా రీయడుగు లవల్లనే యీలొట్టిపిట్టరూపంబును నెఱింగినవారై వారిపాలికిఁ దోఁచిన గుఱుతులను జెప్పుట కారంభించిరి.

అప్పుడు మొదటివాఁడగు బోధాదిత్యుం డునడచి పోయిన యొంటె కొకకాలు కుంటి యనియు, రెంటివవాఁ డగు బోధచంద్రుఁ డీలొట్టిపిట్టవాలము పొట్టిగా నుండుననియు, మూఁడవవాఁ డగు బోధవ్యాపకుఁ డీయుష్ట్రమున కొకనేత్ర మంధ మనియు, నాలవ వాఁడగు బోధవిభీషణుఁ డీయొంటియు గర్భిణి యనియు ననుకొనుచుం జనుచుండ నొంటెను పోఁగొట్టుకొనిన వర్తకుఁడు వీరి కొక పింటిపట్టుదూరము వెనుకనుండి వచ్చుచుండి యీమాటలు విని యీ పోవుచుండు సత్పురుషుల నడిగితినేని, నా యొంటె పోయిన త్రోవ నెఱిఁగింతురని తలఁచి శీఘ్రగమనముచే వారలం గలియవచ్చి ఓయయ్యలారా! మీరీత్రోవయం దొక లొట్టిపిట్టం గంటిరా అని యడిగిన నామంత్రిశేఖరు లీవర్తకుని యాతురపుపలుకులాలించి చిరునగవుతోఁ బరిహాసముం జేయుచుఁ జనుచుండిరి. అతండును బహువిధంబులఁ బ్రార్థింపుచు వెంబడించి వచ్చుటచేత బోధాదిత్యుం డతనిం గని

నీ యొంటె కొకకాలు కుంటిగా నుండునా? అని పలి
కెను. అది విని బోధచంద్రుఁడు మొదలగు మువ్వురు
మంత్రులును క్రమముగా నీయొంటెకు తోఁక పొట్టి
గానుండునా యనియు, దాని కొకకన్ను గ్రుడ్డియా
యనియు, అది గర్భము ధరించి యున్నదా యని
యును బలికిరి.

అంత నావర్తకుఁ డామాటలు వినినమాత్రము
ననే వరాలకుప్ప దొరికిన దరిద్రునిమాడ్కి ను
ప్పొంగి యో సత్పురుషులారా! మీర లానతిచ్చిన
సంగతు లన్నియును సరే, యిప్పుడాలొట్టెపిట యేది
క్కునుఁబట్టి పోయినదని యడిగిన సందుల కా పురుష
శ్రేష్ఠులు నీయొంటెను మేము చూచినదే లేదు.
దాని యవయవగులనుబట్టి మేము చెప్పితిమి: అని
వారు బదులు చెప్పిరి. అంత నావర్తకుఁడు మిగుల
క్రోధావేశమగ్నుఁడై నాయొంటె నపహరించిన చో
రులు మీరు గాని యితరు లెవరును గారని కొంత
సేపు వాగ్వాదము చేసిన వారును కోపోద్రేకమాన
సులై కలహించిరి. తరువాత చెయిచెయి కలిపి
యొకఁడొకరు పైగుడ్డలు పట్టి లాగుకొనుచుం జని
యలకేశ్వరభూపిభునిసముఖంబున తమవ్యాజ్యము
యొక్కస్థితిని విన్నవించిరి. అప్పుడారాజచంద్రుం డీ

వాదిప్రతివాదులవాఙ్మూలములను పుచ్చుకొని యిది యేమో వింతగా నున్నదని యాశ్చర్యమును బొంది కొంతసే పాలోచించి యామంత్రివర్యులమాటల పొందికయును, వారలబుద్ధివిశేషమును, సౌమ్యగుణములును, చక్కని నడవడికయును, గలికితనంబును, శుద్ధమైన ధీరత్వమును గని వీర లీపాపకృత్యం బగు చోరకృత్యమునుఁ జేసి యుండఁ జాలరు; తమయొక్క బుద్ధికుశలతవల్లనే యాజంతువుయొక్క గుఱుతు లన్నియుఁ జెప్పియుండుట నిశ్చయంబని తలంచి యిట్టి బుద్ధిమంతులగు సత్పురుషుల నీవసుంధరయం దెచ్చటనుం గనియు వినియు నెఱుంగనని సంతోషవార్ధిని మగ్నాంతరంగుండై యొంటెను పోఁగొట్టుకొనిన వర్తకుని కేనూరువరాలు నొకశాలువయునిచ్చి మఱియునుం గొన్ని బహుమతుల నిచ్చి మంచిమాటలచేత నతని సమ్మతిపఱిచి యునికిపట్టున కనిపినవాఁడై, తదనంతరంబ యామంత్రిశేఖరులఁ జూచి యాదరించి వారివృత్తాంతం బంతయు సవిస్తరంబుగా దెలిసికొని యిట్టి బుద్ధివిశేషముగల మంత్రులు సముఖంబుననుండిరేని తనకు శ్రేయోభివృద్ధి కాఁగలదని నిశ్చయించి యంతఃపురంబునకుఁ దోడుకొనిపోయి విందుచేయించి నలుగురుమంత్రులను నాలుగందలముల

పై నెక్కించి భేరీభాంకారాది చతురంగవాద్యములు మ్రోగుచుండఁగా నాపుటభేదనప్రదక్షిణం బొనర్చి దివ్యశకునము లగుచుండఁగా వందిమాగధబృంద ములు గొలువఁ గొలువుకూటమున కరిగి తత్క్షణంబ వారలకు గొన్ని బహుమతు లిచ్చి యాస్థానమున ముఖ్యామాత్యులనుగా నుంచుకొనెను. ఇట్లు తత్స హవాసనిత్యానందములతో నా రాజపురందరుం డొప్పి యొప్పిదంబగు ధర్మపరిపాలనంబుఁ జేయు చుండు కాలంబున నానలువురు నాయా కాలోచి తంబు లగు నీతులం దెలుపుచుఁ జిత్తాహ్లాదకరంబు లగు పూర్వ రాజచరిత్రంబుల చందంబు లెఱింగిం చుచు, రాజునకు ప్రాణపదసచివులై యుండు నంత, కొంతకాలంబు చనినపిదప నొకనాఁ డానలువురు మంత్రులును తమయొక్క అనాగతవర్తమానజ్ఞాన మువల్ల భూవిభునకు ముందు గీడు రాఁబోవుచున్నది గాన నలువురమును నాలుగు జాములయందును రాత్రికాలం బంతయు, ప్రత్యహంబును గాపాడు చుండవలసినదని సంకేతముఁ జేసికొని, అదిమొదలు ప్రతిదినమును రాత్రులందు క్రమముగా మొదటి జామున బోధాదిత్యుండును, రెండవజామున బోధ చంద్రుఁడును, మూఁడవజామున బోధవ్యాపకుఁడును,

నాల్గవజామున బోధవిభీషణుండును రాజశయన గృహంబు బాదిగా నాపట్టణమున సమస్తప్రదేశములం జుట్టుచు, భీతియనుమాట జనింపకుండు నటులు మిక్కిలి నీతియుక్తులై కాపాడుచుండిరి. అట్లు కొన్ని దినంబు లరిగిన తర్వాత నొకనాడు మొదటిజామున కాపాడు వంతుగల బోధాదిత్యుడు సూర్యాస్తమయము కాగానే సంధ్యావందనాది కృత్యములు నెఱవేర్చుకొని తనవంతు ప్రకారము ప్రభువు యొక్క పడకటిల్లు మొదలు పట్టణము సమస్తప్రదేశములు నుంజూచి బహిఃప్రదేశమంతయు జూచి వచ్చుటకై బయలుదేరి పట్టణమునకుఁ బ్రదక్షిణముగా వచ్చుచుండఁగా నాపురమున కుత్తరముగా నుండు భద్రకాళిగుడిలో నొకస్త్రీ రోదనముచేయు ధ్వని వినిపించెను. ఆశబ్దము బోధాదిత్యుడు విని యీరాత్రి సమయములో నీయుద్యానమున నేడ్చుచుండెడు వనిత యెవ్వరో, యిట్లు వగచుటకు కారణ మేమో తెలియ లేదని విచారగ్రస్తుఁడై యాసంగతి విచారించి తెలిసికొనవలయు నను మమతచే నాభద్రకాళియాలయముఁ బ్రవేశించి ధ్వజస్తంభము మరుగు సేసికొని నిలిచి యీరాత్రికాలమున నిచట యేకాకివై యేడ్చుచుండుటకుఁ గారణ మేమి? నీ వెవ

తెవు? ఎచ్చటనుండి వని యీ యేడ్చుచుండు భద్ర
కాళి నడిగిన, నాదుర్గయు రోదనముఁ జాలించి
నిన్నుఁ జేలయేడ్చెదవని యడిగిన మనుజుం డెవండని
ఘీంకారముఁ జేయుచు నడిగిన నాతండు భీతిలేని
మనముగలవాఁడై ఓతల్లీ! నే నీయులకాపురాధీశ్వ
రుండగు నలకేశ్వరమహేశ్వరునకు ప్రాణపదుఁడనై
యుండెడు పెద్దమంత్రినై బోధాదిత్యాఖ్యచే నలరు
చుండువాఁడ. నే నిప్పుడి బహుదూరప్రదేశమునకు వచ్చి
యుండి యిచట రోదనధ్వని విని యీ నిశాసమయం
బున నిట్టి దుర్గమస్థలంబున వగచెడు వనిత యెవరో
తెలిసికొనవలయునని వచ్చితి; కావున ఓతల్లీ! నాయం
దలుగక కృపాసముద్రంబున నన్నుఁ దేల్చి నీపుత్త్రు
నిగా భావించి నీ విప్పుడు వగచు కారణమును సవి
స్తరముగా నానతిమ్ము. అని వందనము లొనర్చి
యెదుట నిలచిన నాకాళికాదేవియు తనయొక్క
రౌద్రాకృతిని విడిచి సౌమ్యముఖము గలదై యొక
మనుజకన్యారూపము ధరించి యోకుమారకా!
బోధాదిత్యుండను పేరు నీకే తగును. నీ ధైర్యము
నకు మిక్కిలి సంతసించితిని. నేనిప్పుడు వగచు కార
ణము నీ కెఱింగించితినేని యీకార్యము నెఱవేర్చె
దవా? అని యడుగఁగా అతఁడా దుర్గాదేవికి పున:

పునః ప్రణామంబు లాచరించి ఓ లోకజననీ! కాళీ! దుర్గా! మహామాయి, మొదలగు పలుకులచేతి సమస్తజనులచేతను స్తోత్రముజేయఁబడు నా మాతవగు నీ యనుగ్రహము నాయందుఁ పూర్ణముగా నుండెనేని నాచేత కాని చెయ్దియుంగలదా? కాఁబట్టి యెట్టి కార్యంబైన నెఱవేర్చెద నానతిమ్మనిన నామాతంగి యతని వినయ చాతుర్యగాంభీర్యాదివాక్యంబులకు నలరి యిట్లనియె. ఓమంత్రికుమారకా! మీ ప్రభుండగు నలకేశ్వరభూభర్త మిక్కిలి నీతియుక్తుండై రాష్ట్రమును బాలింపుచు శివాలయ విష్ణ్వాలయ దుర్గాలయములు మున్నగు దేవతాలయప్రతిష్ఠలును సత్రములు, చావళ్లు మొదలయిన సమస్తజనోపయోగిధర్మంబులును, ఆరామతటాకాదిఫలజలసమృద్ధిగలసత్కార్యోద్ధరణంబులును జేయుచు నలహరిశ్చంద్రాది మహాభర్తలంబోలి శౌచసత్యవాక్యనిరతుండై యుండుటచేత నిట్టి పురుషున కొకకీడు రాఁబోవుచున్నది గాన తచ్చింతాపరవశురాలనై ఆవ్యసనాగ్నిని భరింపఁజాలక యేడ్చుచుంటి నంతియేకాని మఱే యేరూపమగు చింతయును నామనంబునం బొడమినయదికాదు. ఇప్పుడు నీవు నన్నుఁ బ్రార్థించి యడుగుట వలన నా వగచు

కారణంబు సవిస్తరంబుగా నెఱింగించితి నని భద్ర కాళి చెప్పఁగానే బోధాదిత్యుఁ డార్తహృదయుఁడై దేహస్మృతి తెలియక వికారపుచూపులు చూచుచు కొంతసేపు తానును జింతించి పిదప ధైర్యయుక్తుఁడై భద్రకాళి పాదారవిందములకు వందనంబు లొనర్చి ఓజననీ! నాయందుఁ బ్రసన్నముఖివై కృపాయత్త చిత్తంబున నీకీడు దొలంగునటుల ప్రసాదించవల యునని వేఁడుకొనెను. అంత నాభద్రకాళి బోధాది త్యుని ముఖమువంకఁ జూడ్కి నిలిపి యోమంత్రిపు త్రకా! యీకీడు దొలంగునట్టి యుపాయము సంభ విందు వగయునుఁ దెలిపెద. నావధానచిత్తుఁడవై యాలింపు మని మాతంగి చెప్పుట కారంభించెను. నేఁడు సూర్యోదయకాలమునకు మన దేశంబున నుండి నూతనధాన్యము బండ్లమీఁద సాగించుకొని వత్తురు. ఆధాన్యము రాఁగానే ప్రథమతః ఫలించి వచ్చిన క్రొత్తధాన్య మగుటచే నరేంద్రుఁ డాధా న్యమును బియ్యము చేయించి యారాత్రిభోజన మునకే యుపయోగపఱచవలసినదని కొట్టిడి విచా రణతోఁ జెప్పును. అతం డాప్రకారము జరిగించును. ఆయన్నము భుజించినవారెల్లను తత్క్షణమే మృతు లగుదురు. కావున నరేంద్రుఁడును భుజింపఁగానే

స్వర్గస్థుండగును. అట్లు దోషయుక్తముగా ధాన్య ముండుటకు కారణ మేమి యనిన ఫలింపుకాలము లో వెన్నులన్నియు నేలకు మ్రొగ్గియుండఁగా నా మళ్లలో గొన్ని సర్పములు చేరి విహరింపుచుండెను. అట్టిసమయంబున నొకనాఁడు కర్కోటకుండను సర్పమునకును, కుళికుఁడను సర్పమునకును, మూల వ్యత్యాసమువలన కలఁతకలిగి యొకటితో నొక టి పెనఁగుచుండఁగా పరస్పరము అప్పటప్పటికి క్రోధమతిశయమై విషములు గ్రక్కుకొనుచు రక్త ప్రవాహము లయ్యెడిలాగున కఱచుకొనుచు కలహించినందున నావిషరక్తము లామళ్ళలోపారు చుండు నుదకములోఁ గలసి ప్రవహించుట కారం భించెను. పైరును అప్పటప్పటికి పరిపక్వముగా ఫ లించుటచే మిక్కిలి వ్రాలిపోయి యానీరములో నా నియుండుటచే నిట్టి యాపద కాధాన్యము కారణ మగుచున్నది. అయిన, పట్నపుమడియగాని కీసంగతి తెలియనందున తొలిఫలింపుకాన రాజునకు నజను గాపంపించును. కాఁబట్టి యాయన్నము నతఁడు భుజింపకుండునట్టి యుపాయము చేయవలయును. ఈయాపద తప్పెనేని రేపటిదినము మధ్యాహ్నము నకు విజయనగరాధిపుఁడగు విజయశేఖరుఁ డను

రాజు మననగరాధిపునకు హానికలుగఁజేయుటకున్నై అమ్ములపొది యొకటి నిర్మించి దాని నిమ్ముగా నభిమంత్రించి ఒకబుంగలో నునిచి కొన్ని యపరూపభక్ష్యములను దానిపై నునిచి తగిన మూతనల్లిబిగించి మఱికొన్ని రాజోపయోగి ద్రవ్యంబులను నొబ్బుంగయుఁగూడ నొకబండియందుఁబెట్టించి కొందఱు పరిచారకులం బిలచి యాశకటమునం దునిచి యుండు సమస్త వస్తువులను అలకేశ్వరునిసన్నిధిలో నొప్పించి రండని యుత్తరువు చేయును. వారలాప్రకారమే సకలవస్తుపరిపూర్ణంబగు నాబండిం దోలుకొని వత్తురు. అప్పుడు రాజేంద్రుం డాబుంగను ముందుగా నుంచుకొని మూఁత విప్పించఁగానే దాని యందుంచియుండుయమ్ములపొది వియన్మండలమున కెగరిపోవును. అందుచే రాజునకు హాని కల్గును. ఆయాపదయుండప్పనేని రేపటిరేయి నరవరుండు పతిసమేతుఁడై హంసతూలికాతల్పంబున శయనించి నిద్రించుసమయంబున నొకసర్పంబు తూగుటుయ్యెలగొలుసుమార్గముగా వచ్చి యతనిం గరచిపోవును. కావున నవశ్యంబును హానిం జెందును. ఈమూఁడు గండములు గడచెనేని యారాజేంద్రుం డింక నూటయిరువది యబ్దంబులు భూతలంబేలుచుండు నని

భద్రకాళి యానతిచ్చిన బోధాదిత్యుఁడు సంతసించి ఓతల్లీ! జగన్మాతా! యీవిపత్తులు దొలఁగునట్లను గ్రహించి రక్షింపుమని బద్ధాంజలిపుటుండై స్తుతిం పుచు బహువిధంబుల నాకాళికాదేవికి కృపపుట్టు నటుల చేయఁగా నంత నాకాళియు మెచ్చి పుత్రకా నీకు కార్యసాఫల్యమగున. ఆయావిపత్తులను దప్పిం చునపుడు ఆయా కాలోచితములగు యుక్తులునీకుఁ దోఁచుఁగాని యింక నీవిచ్చటనుండితివేనివిహారార్థం బరిగిన నాపరివారం బంతయు వచ్చునట్టి కాలంబు సమీపించెఁ గావున నిన్నుఁజంపుదురు. కాఁబట్టిశీఘ్రం బుగఁ జనుమని యనిపిన నతెంమను భద్రకాళిచే మన్ననవడసి తనమందిరముఁ బ్రవేశించి మఱుదినము సూర్యోదయకాలమున రాజనగరద్వారమునసమస్త కార్యంబులును విచారించుచుండెను. అంతఁ గొంత కాపుజనము క్రొత్తధాన్యము బండ్లమీఁద సాగించు కొని వచ్చి రాజునకు సమాచార మంపిరి. అతండును మితపరిజనుఁడై నగరద్వారమునకు వచ్చి యాధా న్యము నంతయు తగిననెలవున బదిలపఱచి కొద్ది ధాన్యమునుమాత్రము కొట్టిడి విచారణకర్తవశ ముగా నొప్పగించి యీధాన్యము నీరాత్రిభోజన మునకే పక్వము చేయింపవలసినదని యుత్తరువు

చేసెను. వాఁడును రాజుయొక్క ఆజ్ఞాప్రకారము నడిపించువాఁడై యాధాన్యమును దంపకము చేయించి బియ్యముచేసి కాఁగానే మహానసగృహం బున కనిపి తనయుద్యోగమునందు జాగరూకతకలిగి యుండెను. బోధాదిత్యుఁడు మధ్యాహ్నకాలమునకు పూర్వవత్తుగానే పట్టణద్వారమును గాచి యుండెను.

ఇంతలో విజయనగరమునం డుండి తత్పురాధీశు పనుపున భక్ష్యములబుంగను మఱికొన్ని రాజో పయోగములగు వస్తువులను కొందఱు భటులు బండిమీఁద సాగించుకొనివచ్చి పురద్వారసమీ పంబున నిలువఁగానే యీసంగతి పూర్వదివసంబున భద్రకాలిచే నెఱింగినవాఁడు గావున బోధాదిత్యుం డాబండి నచ్చట నిలుపుదలం జేసి తా నంతఃపురం బున కరిగి రాజాలంకరణయుక్తములగు వస్త్రభూ షణములు గొని కారాగృహంబున కరిగి యచట రూపవంతుఁడుగా నుండు నొకఖైదీని పట్టితెప్పించి తాను తెచ్చిన వస్త్రభూషణముల వాని కలంకరించి రాజుగా నిరూపించుకొని బహిర్ద్వారమున నుండు బండియొద్ద కరిగి యచట కొలువుదీర్చి యాభక్ష్య ములబుంగ నతనిపురోభాగంబున నిడి మూత విప్పించఁగానే దానిలో నుంచియుండిన యమ్ముల

పొది యూర్ధ్వముఖముగా నాకసంబున కెగసి యం దగ్ని వొడమెను. ఆయగ్నిపాతముచే నచ్చట రాజ వేషధరుండై యుండెడు నరుండును, తత్సమీప వర్తులగు మనుజులును పరలోకమున కేగిరి. తద్ద్వార బంధం బిడిసి పడియె. అంత బోధాదిత్యుం డచ్చోటు వాసి భూపతి కొలువుకూటంబున కేతెంచు సమ యమునకు ప్రతిదివసంబునేవైఖరి నాస్థానంబునకుం బోవునో, యాపోలిక సఖులగు బోధచంద్రాదులం గూడి రాజపురోభాగంబున నిలచి రాజునకు నమ స్కరించి యుచితస్థానంబునం గూరుచుండి యిష్టా లాపములలోఁ బ్రొద్దుపుచ్చుచు సంతోషమున నుండెను.

అంత సామంత పురోహిత విద్వజ్జన వివిధగా యక కవి నర్తకభటాది పరివారం బంతయు సము చితంబుగాఁ జేరిరి. అంత భటులు సకలదేశవృత్తాం తంబులు విన్నవింప వందిమాగధులు పరాకుఁ దెలుప విద్వజ్జనంబులు సత్ప్రసంగంబుల సల్పఁ గవీం ద్రులెల్లఁ బ్రబంధరచనాకౌశలంబులు నెరపుచుండ బ్రాహ్మణు లాశీర్వదింపఁ బౌరులు పొగడ నమాత్య వర్గంబులు కాలోచితాలోచన లొనర్ప నర్తనాం నగ లాడుచుండ గాయనీగాయకులు పాడుచుండ

సేవకనికరంబులు గొలువఁ బేరోలగంబుండిసూర్యా స్తమయసమయంబునకుఁ గొలువుచాలించి యెల్ల వారలను వారివారియుచితస్థానంబుల కనిపి తాను ను మితపరివారుఁడై యంతఃపురంబునకుఁ జనియె. బోధాదిత్యుండును వేగిరంబ యోగిరంపు గేహంబున కరిగి సూపాధ్యక్షునిం బిలిచి యిప్పుడు పచనముచే సినయన్నంబు నొకపాత్రయం దుంచి యిప్పు డార గించుటకు ముందుండిన ప్రాతబియ్యమును వండు మని రాజుగారు త్తరువుఁ జేసి రని చెప్పి రాజసన్నిధా నంబున కేగెను. అంత నలకేశ్వరుండు బోధాదిత్యు నింజూచి కూర్చుండ నియోగించి ఘటికాద్వ మచ్చటి పరిజనులతో వినోదములగుమాటలాడుచుండి య నంతరంబ భోజనముకొఱ కరుగు వో నచ్చటనుండిన వారల నెల్ల ననిపి ప్రియసచివుండగు బోధాది త్యుం గని భుజించుటకు రమ్మనిన చిత్త మాలాగే చేయుచున్నా నని వెంటం జనియెను. అప్పు డిరువు రును బొత్తున భుజించిరి. తరువాత నరేంద్రుఁడును నతనిసతియు బోధాదిత్యుండును గూడి శయన గృహంబునకుఁ జనినప్పుడు బోధాదిత్యుండాశయన గృహంబునకు బహిస్సీమయందు నిలచెను. రాజు పత్నీసమేతుండై హంసతూలికాతల్పంబున శయనిం

చెను. సుఖనిద్రయుం జెందెను. బోధాదిత్యుండు భద్రకాళి యానతిచ్చిన పల్కులు మనంబునం దలంచుచుం దద్గృహంబుం జొచ్చితూగుటుయ్యెలకు సమీపముగా నుండి గొలుసులయం దీక్షణంబు నిలిపి చేత చంద్రహాసంబుం బట్టుకొని యుండ దుర్గావాక్యపద్ధతిని ప్రథమయామాంతంబునకు గొలుసులమీఁదుగా నొకసర్పరాజము రాజును గఱచుటకై వచ్చుచుండఁ గని బోధాదిత్యుండు చేతిఖడ్గముచేత నాపాపజేని రెండు తుంటెములుగా నఱికి యామంచము క్రిందఁ బడవైచెను. అట్టిసమయంబున నాయురగము ఖండింపఁబడి విషము గ్రక్కు కొనుచు భూమియందుఁ బడుటవలన నొకవిషబిందువు రాజపత్నీపయోధరంబునఁ బడియె. అప్పుడామంత్రిశేఖరుఁ డా విషముపడినసంగతిఁ దెలిసి యిట్లని వితర్కించెను. సకల చరాచర భూతసంతతికిని వృద్ధిస్థితిలయంబు లనుమూఁడవస్థలు గల్పించి త్రిగుణాత్మకంబయిన మూర్తిం ధరించి విరాణ్మూర్తియై శ్రీమన్నారాయణాభిధానంబున భూతసంఘంబుచేఁ బేర్కొనంబడుచుండెడి మద్దైవతంబగు స్వామీ! నాయట్టిదీనున కిట్టి యాపదలు రాఁ జె

ల్లునా? ఈరాజేంద్రుఁడుమత్ప్రభుండుఁగాన నీతని యాపద దొలఁగించుటకై కాళికాప్రసాదమువలన నీసమయమున నిటకు వచ్చియీయురగమునుఁ జంపి కృతార్థుఁడ నైతిఁగదా యని తలంచుచుండ నింతలో మన్మాతసదృశయగునీరాజపత్నికిఁ బ్రాణాపదవచ్చునట్టి సర్పవిషపతనము కలిగె. నే నేమి చేయువాఁడ. ఎట్లు నీతల్లికిఁ గలుగునుపద్రవము తప్పింతును నని మిగుల చింతాభరంబున నిమిషకాల మాలోచించి సాహసమానసుండనై నే నీయువతికి గర్భజనితపుత్రమాత్రుండఁ గావున జననిపయోధరంబు దత్పుత్రుఁడు స్తన్యపానార్థమైస్పృశించుట యుక్తముగా నుండుట ప్రసిద్ధముగదా? నే నిప్పు డీతల్లియొక్క పయోధరంబుల నంటుటయుఁ దత్సదృశంబెయగుంగాని యెందు గానోపదని మనంబున నిశ్చయించి యిందువలన నేపాపంబుఁ బొందకుండునట్లు రక్షింపవలయునని తనయిష్టదేవతం బ్రార్థించి స్వాంగుష్ఠనఖంబున విషపతనస్థలమునఁగలచర్మముతోఁ గూడ నావిషమును దీసివైచి యచ్చట నుంచియుండిన పోకవొత్తుచేతఁ దన యంగుష్ఠఖండనం బొనర్చి యావ్రేలిఖండంబునుఁ గూడ సర్పఖండములతోఁ జేరవైచి యంత నచ్చట నిలువక తలుపుఁ దెఱచి

బయలు వెళ్లిపోవుచుండఁగా నారాజపత్నికి గాయము తగిలియుండు స్తనయుమీఁద పసుటవలన కూరుకు తెలిసి లేచికనులువిచ్చినలుదిక్కులం బరికించి పోవుచున్న బోధాదిత్యునిం జూచి యీయర్ధరాత్రంబున నిరహస్యప్రదేశముఁ జొచ్చి పోవుచున్న వాఁడ వెవఁడ వని క్రోధారుణితలోచనయై యడిగిన నతం డచట నిలువక యతివినయంబున తల్లీ! నేను భవద్గర్భార్భకసదృశుండనగు బోధాదిత్యుండనని బదులుసెప్పి యుచితస్థానంబున కరిగెను. పిమ్మట రాజపత్ని యార్ద్రహృదయంబునఁ బరితపించుచు నీశ్వరా! యిట్టిపాతకంబు నా కొడిగట్టం దగునా? నేను మత్పితృగృహంబున నుండునట్టి లేఁబ్రాయంబున బుద్ధిఁ దెలియుటకుఁ బూర్వంబె పురుషునిఁజూచి యుందునేమో? తెలియదు. తదారభ్య యీదినపర్యంతము నీయాలకేంద్రుం డొక్కఁడుతప్ప కలనైన నే నన్యపురుషదర్శనపాపము నెఱుంగ. ఇట్టికాలంబున కీదుర్వర్తనునియంగస్పర్శకలుగునట్లు విధించిన కమలజుకృత్యంబునకు వగచెదను. ఇదియునుంగాక యిద్దురాత్ముండగు బోధాదిత్యుండు ఈనరేంద్రున కౌరసునిమాడ్కిఁ జరించుచు నిట్టిరహస్యప్రదేశములకు వచ్చునట్లు చనువొసంగునం

త నమ్మకమీాయ నిప్పు డిట్టిపాపకృత్యమునకు లోన య్యెను. ఏమిసేయుదునని రిచ్చవడి వెచ్చనూర్పు చు నచ్చకోరనయన పచ్చనికోకవానిఁ జేరఁ జనుచుఁ గొండొకసేపువగచి తన మగనికీవర్తమాన ముం దెలుపునదియై యతనిం బోధించి యోప్రాణ నాయకా! నేటిదినంబునకు నాకు అన్యకరస్పర్శ నం బగునట్లు పద్మజుండు వ్రాసెను. ఎటులంటేని? శ్రీమన్నారాయణదేవునికటాక్షమునను, మనభద్ర కాళికృపచేతను, సంరక్షితనై మీాచే మన్నన వడసి యుండెడి నన్ను నొకదుష్టుండంటి వెలయాలిని మోసపుచ్చు పల్లవుండునుంబోలె నే నిప్పుడు సుఖ నిద్రం జెందియుండెడిసమయంబున నాపయోధరం బంటి నఖక్షతం బొనర్చి చనియె. అంత నేనును కూరుకుం దెలసి కనువిచ్చి చూచి వాకిటితలుపు తీసి వెలిగాఁబోవుచుండు మనుజునింజూచి యెవఁడు రా యీానిశీథసమయమున నిట్టి రహస్యప్రదేశము నకు వచ్చి చనియెద వనిన కొంచెమైనను భీతిఁజెందక నేనుగదా బోధాదిత్యుండ నని చెప్పుచుఁ జనియె. ఈదూష్యకృత్యము నాయందు కలుగుట నే జనిం

చినకాలవిశేషమో, బ్రహ్మలిఖితనిర్ణయమో, పురాకృత దుష్టకర్మఫలమో? తెలియదని వర్షాకాలంబున వర్షించు స్వాతిమేఘమునుంబోలె విశాలనేత్రంబుల జనించిన కన్నీరు గిరులకందరములఁ బోలెనున్నమలమాడ్కి కుచపర్వతంబులపై జడి ప్రవహించుచుండఁ దనపయోధరంబునం గల నఖక్షతముంజూపిన నతండును ఖిన్నమానసుండై 'హా హా! యేయుగంబుననైన భూర్భువస్సువర్లోకములయందైన నేమనుజుండైన నిట్టిదుష్కృత్యముం బొనర్చునని పెద్దలచేత వినియు నెఱుంగ. ఇక్కాలంబున బోధాదిత్యుం డొక్కఁడుదక్క నెట్టి పాపకర్ముండైన నేకాలంబుననైన నిట్టి పాతకంబుఁ జేసియుండం గనియు నెఱుంగ. ఇంతయును నేల? మత్పూర్వభవకృతపూజాఫలవిశేషం బిట్టిద కాబోలు. అయినను వీనితోఁగూడ వచ్చి మనవీట నుండెడు బోధచంద్రుఁడు మున్నగుమువ్వురికిని జరిగినవృత్తాంత మంతయు నెఱింగించి యంతమీఁద నిష్పాపకర్ముని చిత్రవధ గావించెద' నని యరుణీకృతనేత్రుండును, కంపితదేహుండును, చలి

తాధరోష్ఠుండు నగుచు మనంబునఁ గోపంబు ముప్పి రిగొనఁ గొంతశాంతుండై తన్ను తాన దూరుకో నుచు స్వపత్నీపరితాపనివారణంబు సేయునట్టినుపు లుపల్కుచు నుండుసమయంబున రెండవజాముస కావలియుండు వంతుగల బోధచంద్రుఁ డప్పట్టణాం బంతయుఁ దిరిగి రాజశయనగృహము చుట్టునుం జూచి తత్సదనంబు బ్రవేశించిన నజ్జననాయకుం డతనిని హెచ్చరించి యతనితో నిట్లనియె. "ఓయీ! బోధచంద్రా! యిక్కడకు రమ్ముక విశేషంబు నెఱింగించెదను." అని చేరఁ బిలచి "బోధాదిత్యుఁ డు మొదలగు మీరు నలువురును మత్పుత్రసదృ శులని నమ్మి యీశయనగృహంబ బాదిగా సమస్త రహస్యప్రదేశములందును నిరాటంకముగా మీరు సంచరించునట్లు ఉత్తరువు చేసి నిష్కపటముగా నతి ప్రీతుఁడనై మన్నించుచుండెడి నాయందు కన్నతల్లిని కలియఁగోరు నికృష్టుండునుంబోలె నిప్పుడు బోధా దిత్యుండు నాసతియు నేను నిద్రించుసమయమున మత్సతీపయోధరంబంటి నఖక్షతంబొనర్చి యేగు చుండఁగా నయ్యువతి మేలుకని యెవరచ్చట నని

యడిగిన, తల్లీ! నేను గదా బోధాదిత్యుండ నని చెప్పుచు నిర్భీతుండై వెళ్లిపోయెంగాన నిప్పుడు వానికి చేయందగినశిక్ష యిట్టిదని నిరూపింపు” మనిన నామంత్రిసత్తముండు రాజునకు మ్రొక్కి బద్ధాంజలిపుటుండై “స్వామీ! మీపాదసరోజ ముల సాక్షిగా నాకుఁ గోచరించినంతవట్టును సత్యంబు నుడివెద. సావధానచిత్తంబున నాకర్ణించు నది” యని చెప్పందొడంగెను. “బోధాదిత్యుం డెన్నండును నిట్టి యసత్కార్యముంబొనర్చిన వాఁడు కాఁడు. ఇప్పుడు మీరానతిచ్చుట యోచింపఁగా నిప్పరవ చిన్నదిగా నున్నదని యెంచి పై చెఱంగున ముడిచిన మూర్ఖునివలె నెన్నఁదగియున్నది.

అగ్ని నంటిన వస్త్రము భస్మముకాక మానదు గదా? ఇకార్యం బతం డొనర్చినదియు, లేక యతం డట్లొనర్చుటకు కారణం బుండెనేనియు త త్కారణంబు విమర్శించి యతనియందు పాపబుద్ధి కలిగియుండెనేని తగినదండనం బొనర్పవలయును. విచారింపక త్వరపడి చేసితి రేని వేఁటకుక్కను పెం చిన ఉగ్రవీరుండను కిరాతునిమాడ్కి పరితాపంబు

నంది తదనంతరంబున నాపదఁ బొందంగలరు. కావున చాల పరిశీలించి కార్యనిశ్చయము సేయుం” డనిన రాజతనినింజూచి నీ విప్పుడు చెప్పినకిరాతుని కథ వినవలతు సవిస్తరంబుగా నెఱింగింపు మనిన బోధచంద్రుం డిట్లనియె.

---

# 1

బోధచంద్రుఁడు గాఋనకుఁజెప్ప కుక్కనుజంపిన

## కిరాతునికథ.

ఉత్తరదేశంబున నొకరాజధానికి సమీపార ణ్యంబున సుగ్రీవుండను నొకకిరాతపతి మిగుల ద్రవ్యము నార్జించి గర్వాంధుండై యుండఁగా నా పట్టణాధీపుఁడు మనుజేంద్రుఁడు వానిఁ బట్టి తెప్పించి కలిమిదగఁగ యియ్యవలయునని మిగుల బాధిం పఁగా నాశ్రమపడఁజాలక యెంతమాత్ర మీయ వలయు నానతిండనిన నారాజవరేణ్యుండు రెండు వేలవరా లిచ్చునట్టుత్తరువు సేయఁగా సుగ్రీవుఁ డంత మొత్తమీయఁ జాలనని బహువిధముల వేఁడుకొని వేయిన్నూఱు వరాలిచ్చు నట్టేర్పాటు చేసికొని నాలుగుదినములు గడువుదీసికొని గృ హంబునకుంజని యింటఁగల సమస్తవస్తుసముద యంబుఁ గ్రయపఱిచి యాపైకం బంతయుఁ గూర్చి మొత్తముసేయఁగా వేయివరాలుమాత్ర మాయెను. తక్కిన యేనూఱువరాలకు తగిన అయి వజులేక వేఁటకుక్క నొక వైశ్యునియొద్ద కుదువ

యుంచి యేనూఱువరాలను బుచ్చుకొని సదరు వరాలు నందలి వడ్డియు రెండు నెలలకు ఇచ్చు లాగున నొడంబడిక వ్రాసియిచ్చి వేయు నేనూఱువరాలను గొనిపోయి సర్కారులోఁ జెల్లించి మరల నావర్తకుని యింటికిం జని కుక్కనుముద్వి ముద్దుముఁగొని మనుష్యులుమాట్లాడు మాటలు తెలియులాగున నాకుక్కకు నేర్పియున్నాఁడు కావున దానింజూచి 'యోమృగసింహామా! యీసెట్టిగారితావున నేనూఱువరా లప్పుపుచ్చుకొని సిన్ను కుదువయుంచితిని; కాఁబట్టి నేనావరాలు వడ్డియు నీయునకుఁ జెల్లించుపర్యంతము సెట్టిగారు ఏకార్యమందాజ్ఞాపించుదురో ఆకార్యమం దతిజాగ్రత్తిగా వారియిష్టము ననుసరించి యుండవలసిన'దని బుద్ధి చెప్పి సెట్టితో 'యయ్యా! ఈకుక్కను నాప్రాణములతో సరిగా కాపాడుకొనుచుందును. కాఁబట్టి చక్కఁగా నన్నపానీయాదుల విచారించి పోషింపవలయు'నని చెప్పి యాతనియుత్తరువు నంది తనయూరణ్యమున కేగెను. తరువాత నాకుబేరుఁడు దేశాంతరమునకు వెళ్లి వ్యాపారము చేయవలయునను నిచ్ఛచేత రత్నములు, పవడములు, ముత్యములు, అపరంజి మొదలయిన వెలపొడవుసామాను యీ

వత్తు జాగ్రతచేసికొని ప్రయాణసన్నద్ధుండై ‘యో శునకమా! నేను దేశాంతరమునకు వ్యాపారార్థమై వెళ్లుచున్నాను. కాబట్టి, తిరుగా నేను వచ్చుపర్యంతము మనయింటి లోని కితరజనులు, దొంగలు, పిశాచములు, మృగములు మున్నగునవి రాకుండ వాకిట కావలియుండవలసిన’దని చెప్పి ప్రేమతో శరీరమును దువ్వి తనసతిం గని ‘యోతన్వీ! నేను తిరుగా వచ్చుపర్యంతము నీకుక్క మనవాకిట కావలియుండును; కాబట్టి ప్రతిదినము మూడుకాలములయందును క్షీరాన్నము నిడి కాపాడుచు నీవును జాగ్రతగానుండు’ మని దిట్టపఱచి యాతండు దేశాంతరమున కేగెను. అంత నాసెట్టిభార్య భర్త యేగిన పిమ్మట నొంటరిగా నుండుటచేత మనోభీష్టప్రకారము సంచరించుచు కొన్ని దినముల కొక చోరపురుషుని సంపాదించుకొని యతనితోఁగూడి ప్రతిదినంబును రతిపతికేళి నోలలాడుచు విఱ్ఱవీగి సర్వక్రియలును మఱచియుండఁగా నాకుక్క యాదుష్టప్రవర్తనను జూచి సహింపక యీామగుప యిట్లొనర్చుట యుక్తం బగునా? యని కినిసి మనంబునం దలపోయుచుఁ దత్ప్రవర్తనాభంగం బొనర్చుటకు

తగినకాలంబు వేచియుండెను. అంత నొకనాఁడర్ధరాత్రంబున నావైశ్యభామిని చోరనాయకునితోఁ గూడ సరససల్లాపము లాడుచుండఁగ నాసమయంబున పండుకొనియుండిన కుక్క లేచి నీల్గి తోకఁ జాడించి చెవులు తాటించుకొనుచు వారుండెడు స్థలమునకుం జని నలుదిక్కులుం జూచి యొకయుపాయముచేత వాసి బీజమునుగఱచి యమసదనంబునకనిపెను. ఆసమయమ్మున సెట్టియిల్లాలు మనంబున మిగులభీతిఁ జెంది గడగడవడంకుచు కాళ్లు తడబడుచుండఁగా దిగ్భ్రమ నొంది వికారపుఁజూపులు చూచుచు కన్నీరొలుక చింతాకులమానసంబున కొంతసేపు వగచి యంతట ధైర్యం బవలంబించి యిట్లని వితర్కించె. ‘ఈపురుషుం డెప్పుడు నాయందు ప్రేమాతిరేకంబున నన్ను విడువక మన్నింపుచుండుటను ఎన్నికచేత నత్యానందంబుం జెందియుంటి. ఇట్టి యొప్పిదంబుం గనియోర్వంజాలక నాపాలిటిదైవం బిట్లొనర్చె నింక నేనేమిసేయంగలదాన నింతియకాక యీశవమును ఇచ్చటనే యీరాత్రి గడుచుపర్యంతము నునిచితినేని బంధుజను లెల్ల గుంపులు గూడి యల్లరిచేసి దూరుదురు. గావున నిప్పుడె పెరటిలో

పూడ్చివేయుట యుక్తమని నిశ్చయముచేసికొని యాయర్ధరాత్రమందే రెండవనరునకు దెలియకుండ యింటివెనుకటి దొడ్డిలో నొకపల్లము ద్రవ్వి యా శవము నందులో పూడ్చి వేసినదై తత్సంబంధమైన క్రోధముచే ఆదినము మొదలు కుక్కను చక్కఁగా నన్నపానీయాదుల విచారింపక తానుమాత్రము త్రికాలములయందును నాహారము గొనుచుండెను. అప్పుడాకుక్క మిక్కిలి వివేకముగల జంతువు కాఁబట్టి, ఇరుగు పొరుగు గృహంబులయం దెచ్చు టనేసియు ప్రాప్తంబయిన యాహారముంగొనుచు కుబేరునివాకిటియందు వానియుత్తరువుమేరకు కావలి కాచుచు ప్రొద్దులు గడపుచుండెను. కుబేరుండు మాసద్వయపరిమిత కాలంబునుం దిరిగి వ్యాపారము జరుపుకొనుచు విశేషించి ద్రవ్యము నార్జించుకొని మరల స్వకీయ గృహ గమనోన్ముఖుండై వచ్చుచు కుక్కను కుదువయుంచిన కిరాతుని గడువుమించెను. గడువుప్రకారము వరాలిచ్చెద. కుక్కను విడువుమని తనగృహమున నేమిబాధ యొనర్చునో ఆదియునుంగాక కుక్కను కావలియుంచి వచ్చితి. దానిఁ బెంచినవాఁడు వచ్చి పట్టుక పోయిన నింట నెవ్వరు దిక్కులేక తన యిల్లాలుమాత్ర

మొంటరిగానుండుట కేమి పరితపించునో యని యాలోచించి యతివేగంబున కొద్దిదినములకే వచ్చి యిల్లు చేరుకొనెను. అప్పుడు కావలియున్న శునకరత్నం బాతనిం గని సంతోషించి ప్రదక్షిణం బొనర్చి సాగిలంబడి తోంకాడించుచు కీచుకీచుమని కూయుచు ఆతనియింటి వెనుకటి దొడ్డిలోనికిని, ఆత నిసన్నిధికిని తిరుగుచు నిలిచినచోట నిలువక మర లిమరలిపోవుచు వచ్చుచుండంగా నాసెట్టి దానింగ నికుక్క మిగుల చిక్కిపోయినది యిప్పుడిది తిరుగు సంగతిచూడంగా యేమోయొకవింతగా నున్నది. కాంబట్టిదీనితోంగూడదొడ్డిలోని కేగి చూచెదంగా క యనియాకుక్కతోంగూడ పోవంగా నదియు నాశవమునుపూడ్చిన ప్రదేశమును త్రవ్వి శవమును బయటకీడ్చెను. అందుకతండు మిగుల నాహ్లాదముం జెంది దానిం గారవించి యో శునకరత్నమా! నీవం టి యుక్తిగల జంతువు నెచ్చటనుంజూచినది లేదు. నీవంటివస్తువును సంపాదించిన యుగ్రవీరునిం గాని యాడ నాతరమగునా? యని సంతోషించుచు తన పత్నింగని యో తెలివిమాలిన తొత్తా! యీనోరు లేనికుక్కకుం గలబుద్ధివిశేషము మాటలాడనేర్చిన నీకు లేకుండ పోయినది. అది యెట్లన? దీనికి అ

న్న పానములు చక్కఁగావిచారించుచు పోషించవ లయు నని చెప్పినేను దేశాంతరమునకు వెల్లినందు కు నీవు చక్కఁగా నీరాహారములు విచారింపక మిండలమారివై తిరుగుచు, కుక్కను మిక్కిలి చిక్కు నట్లు చేసితివి.

ఇట్టి దుష్టమతివి యింకొక్కనిమిషమాత్రం బేనియు నాయింట నుండం జన దెచ్చటికేనియుం బొమ్మని కొట్టి యిల్లు వెడలించినవాఁడై వంటయిం టికిం జని యచ్చట వచనముఁ జేసి యుంచియుండి నయన్నమంతయు నొక పాత్రయం దుంచుకొని పాలుపోసి కలిపి కుక్కకుఁ జాలినంతయుంబెట్టియుం దుగ్రవీరుఁడు వ్రాసి యిచ్చియుండిన యేనూరు వరాల పత్రము దానిమెడలో నంటఁగట్టి కుక్కత నకుచేసినసహాయము వివరమును దానిమెడయందే బంధించి నిన్ను మిక్కిలి ప్రియముచేతఁ బెంచు కొనిన నీస్వామియగు కిరాతుని యునికిపట్టున కేగు మని యనిపిన కుక్కయును వైశ్యునకు ప్రదక్షిణం బొనర్చి యతనిచేత ననుజ్ఞనుబొంది యుగ్రవీరుం డుండెడుకాననమార్గంబునఁ జనుచుండెను.

అంత నచ్చట కిరాతపతియైన యుగ్రవీరుండు గడువు అతిక్రమించినది. కుక్కను కుదువయుంచి

వచ్చితిని, నే నాలస్యముచేసితినేని గడువుదప్పుట చేత నావర్తకుండు ఏమిచిక్కులంబెట్టునో తెలియదు. నాపంచప్రాణములలో నొక ప్రాణమువలె కా పాడుచుండిన కుక్కనుచూచి రెండు నెలలాయెను. కాంబట్టి శీఘ్రగతిం జనుట యుక్తమని యేనూరు వరాలను వస్త్రము నొకముడియుగా కట్టి కట్లసం చిలో వేసి కత్తింబున నిరికికొని యత్యీరంబగు వేగంబున నడచి వచ్చుచుండు సమయంబున మార్గమధ్యమునందుం దన కెదురుగా నడచి వచ్చు చుండెడు కుక్కనుజూచి యీకుక్క న్యాయదృష్టి గలిగిన దనియు దీనివల్ల విశేషించి కీర్తి నొంద వలయు ననియు నెంచి యుంటి. ఇప్పు డీకుక్క సెట్టిని మోసపుచ్చి వచ్చుచున్నదని యెన్నుకొ నుచు వచ్చుచుండెను. కుక్కయును తన ప్రభువగు కిరాతునిం జూచి మిగుల నాహ్లాదముతో సెట్టికి తానుచేసివచ్చిన మహానతును కనుపఱచి గౌరవ మును బొందెదంగాక యని చేరంజని ప్రదక్షిణ నమస్కారములం జేసి కీచుకీచుమని కూయుచు తోంక నాడించుచు నూర్ధ్వముఖముగా తలయెత్తి వర్తకుండు తన మెడపట్టికను కట్టిన పత్రికలను చూపంగా సతండాగ్రహంబున నాపత్రికను జూ

డక "యోయపర బుద్ధిగల శ్వానమా! నిన్ను సెట్టి యొద్ద కుదువయుంచి వచ్చియుండఁగా నతని మోస పుచ్చి నాకు పరపత్యము పుట్టకుండా చేసిన దేగాక నాతాపున నాటాడెదవా?" యని దానిం జురచురం జూచుచు జంద్రహాసముచే శిరంబుఁ దెగవైచి యొ కపల్లమున బూడ్చినవాఁడై వర్తకమందిరమునకుం జని "యయ్యా! యివిగో నీవరాలు దెచ్చితిని లెక్కప్రకారము అసలు వడ్డీని దీసికొని నాపత్ర మును నాకిప్పించు"మన,వైశ్యుఁడు కిరాతున కిట్లని యె. "నాకియ్యవలసిన యేనూరువరాలను నీవి య్యవలసినది లేదు. ఎందువల్లననిన నీకుక్క నాకు నీ వీయవలసినదానికంటె యెక్కువ సహాయము చేసినది. కావున దానికి ఇనాముగా నాపత్రమును దాని యఱుతం గట్టి యనిపితిని. మార్గమధ్యమున నీవుచూడనే లేదా? నీవిప్పు డింటి కేగిన సమాచార మంతయు నీకే వెల్లడి కాఁగలదు." అనగా కిరా తుఁడు మిగుల సంతాపాయత్తచిత్తుఁడై వర్తకుని తో నిట్లనియె.

"ఓ సెట్టిగారూ! ఈసంగతి నాకుఁ దెలియక కు క్క నిన్ను మోసపుచ్చి నాయొద్దికి వచ్చుచున్నదని తలఁచి అప్పటికి నాకుఁగలిగిన కోపావేశమున దాని

గొంతు కోసి చంపి యొకపల్లమునఁ బూడ్చి వేసి వచ్చి
తిని. ఇటువంటిపాపాత్ముం డెచ్చటనేనిఁ గలఁడా?"
యని కుక్కను చంపితినను చింతాభరముచేత
దేహస్మారకము దెలియక నేలంబడి పొర్లుచు విల
పించుచుండఁగా కు[illegible] డామాటలను విన్నమా
త్రముచేతనే "శివశివ" యని చెవులు మూసి
కొని యోరి పాపకర్ముఁడా! నీవు విచారింపక
చపలచిత్తుఁడవై నీకిరాతజాతికిఁ దగుకార్యం బొన
ర్చితివి. అట్టి యుక్తివిశేషముగలకుక్క నీవంటి
పాపజాతికిఁ దక్కునా? అయ్యో! యనుచు నతం
డును మూర్ఛనొందెను. అంతఁ గొంతసేపటి కాకి
రాతుఁడు ధీరచిత్తుఁడై "నాకు ప్రాణప్రదమైన
కుక్క పోయిన తరువాత నేనుమాత్ర ముండి
ప్రయోజన మేమి" యని చేతనున్న కత్తిచేత
కుత్తుక కత్తిరించుకొని ప్రాణములు విడచెను. మఱి
కొంతసేపటికి వర్తకుఁడు మూర్ఛదేరి మృతినొందిన
కిరాతునిచందముఁ గని "అహాహా! నేనెంతపాప
కృత్యమునకు లోనైతి! ఇప్పు డీకిరాతుండును
కుక్కయుఁ జచ్చుటకు కారణము నాకృత్యమే గదా?
యితఁడు వచ్చుపర్యంతము కుక్కను నాయొద్దనె
యుంచుకొనియుండి తదనంతరము నాకృతజ్ఞతను

చెల్లించుకొనుటకు దగినబహుమతులు చేసి పంపి నట్టియిన యీ ప్రాణాపద రానేరదుకదా ? కాఁ బట్టి యీ రెండు ప్రాణములు పోవుటకు కారణము నేనే" యని విచారసముద్రమున మునిఁగి పలు తెఱంగుల పలవించుచు ఎన్నిదినంబులుండినను ఈ దేహం బనిత్యమని తెలిసి ధైర్యచిత్తుండై బొక్క సమునం దుండినద్రవ్యము నంతయు బీదసాదలకుఁ బంచిపెట్టి కిరాతునిచేత నుండిన కత్తిచేత నతం డును శిరఃఖండనంబుఁ జేసికొని మృతినొందెను. ఈసమాచార మంతయు నడవిలోనున్న కిరాతుని భార్య విని చింతాపరవశయై నాభర్త మరణము నొందిన తర్వాత నేను బ్రతికియుండు టంతకంటెను మంచిది కాదని విషమును దిని ప్రాణములను విడి చెను. కుక్కయు, కిరాతుండును, భర్తయు, కిరాత పత్నియు, చచ్చినవార్త విని, కోమటిపెండ్లాము నా లుక పెరికికొని ప్రాణములు విడచెను. కాఁబట్టి విమ ర్శగా విచారింపక త్వరపడి చేసినపనికి ఐదుగురు ప్రాణులు శమనాలయదర్శనమును జేసిరి. కావున నెటువంటి దుష్కార్యముచేసిన మనుజుల నైనను పరిశీలనగా విచారించి శిక్షింపఁ దగు. అట్లు చేయని యెడల పైఁజెప్పిన కథరీతిగా ప్రాణాంతము వచ్చుట

సిద్ధము. ఇది నాకుఁ దోఁచినచందం బిఁక మీచి త్తానుసారము కార్యనిశ్చయము చేయుఁడనిచెప్పి బోధచంద్రుఁడు యథేచ్ఛం జనియెను.

---

తరువాత మూఁడవజామున కాపాడు వంతుగల బోధవ్యాపకుఁడు పట్టణముచుట్టునం దిరిగి, అంతః పురముఁ బ్రవేశించి రాజశయనగృహమునకు ప్రద క్షిణముగా వచ్చి తద్గృహద్వారంబున నిలచినం జూచిరాజేంద్రుఁ డతనిం జీరి "యో! బోధవ్యాప కుఁడా! నీమిత్రుఁడగు బోధాదిత్యుం డొనర్చిన మే లు వినుము. అని బోధాదిత్యునిరాక మొదలు, తల్లీ నేను బోధాదిత్యుఁడగదా" యనిచెప్పిపోయిన క థాసందర్భమునంతయు చెప్పి "యీ యంతఃపుర ద్రోహికి ఏమిశిక్ష విధింపవచ్చును? నీకుఁ గోచరించి నంతలో నిష్పక్షపాతముగా దెలుపు" మనిన మం త్రివర్యుఁడు నమస్కరించి "మహారాజా! చిన్ననా టనుండియు నేను బోధాదిత్యుని మైత్రియొనర్చి యుంటిని. అతనిచర్యలెల్ల నామనంబునకు విశదం బులు. అతఁ డిట్టి దుష్కార్యములఁ జేయఁ జా లఁడు. చేసినను కారణ ముండి తీరవలయును. లేక ఇప్పు డతని కిట్టి దుర్బుద్ధి పుట్టునేమో? నిశ్చ

యింప నేను సమర్థుఁడఁగాను. "వినాశకాలే విపరీత బుద్ధిః" అనుపెద్దలనానుడిప్రకార మిప్పు డీబుద్ధి యవాంతరముగా కలిగియుండెనే మోకాని సహజముగా నతఁ డిట్టివాఁడని నమ్ముట యుక్తముగా నుండలేదు. నిప్పురవ చిన్నదైనను కొంగున ముడువవచ్చునా ? కాఁబట్టి యిందుకు కారణము విచారించి మీయిష్టానుసారముగా తగినశిక్ష విధింపవచ్చును. కారణమును విచారింపక త్వరపడినట్టియిన ముంగిసను చంపి తరువాత పశ్చాత్తాపముచే మృతినొందిన బ్రాహ్మణదంపతులవలె నగుదురు గనుక నామనంబునఁ దోఁచిన పలుకులు విన్నవించితిని. ఇంక మీమనంబునఁ దోఁచినట్లు చేయుండనిన విని యారాజేంద్రుం డక్కథ వినవలతుం జెప్పుమనిన బోధవ్యాపకుం డిట్లనియె.

---

## 2

బోధవ్యాపకుఁడు రాజునకుఁ జెప్పిన ముంగిసఁ బెంచిన

# బ్రాహ్మణదంపతులకథ.

---

ఉత్తరదేశమున కాశీనగరసమీపంబున మిథిల యనుపేరం బరగుపురం బొకటిగలదు. అప్పట్టణంబున విద్యాధరుండను బ్రాహ్మణుఁ డొకండుగలఁడు. అతనికి సంతానములేక సమస్తవ్రతంబులును దేవతాప్రార్థనంబులును చేసి యెందునను మనోరథసిద్ధి నొందక ఒకముంగిసను కుమారునివలె పెంచుచుండెను. అక్కాలంబున నొకనాఁటియందాముంగిస తనను పెంచినబ్రాహ్మణునిపై నెక్కియాటలాడుచుండఁగా వారు దానింజూచి ముద్దుపెట్టుకొనుచు మిగుల నాహ్లాదముతో నాటలాడించుచుండిరి. ఆవేడుకను కాశీవిశ్వనాథుండును విశాలాక్షియు అంతర్మార్గవర్తనులై యేగుచు నీ బ్రాహ్మణదంపతు లుండుస్థలమునకు సమముగా వచ్చి వీరలంజూచి పశ్చాత్తప్తమానసులై యొక తనయునిఁ బ్రసాదింప నిశ్చయించుకొనిరి. పిమ్మట విప్రవనిత గర్భము ధరించి కందర్పసమానరూపుఁ

డగు బ్రాహ్మణుఁడు పట్టణములో యాయావర ముఁజేసికొని స్వగృహంబున కేతెంచి యచ్చట నున్న సర్పఖండములను పుత్రకళత్రశవములనుగని సంతప్తచిత్తుఁడై యొడలఁ బ్రాణంబుల నిలుప నోపక మృతుం డయ్యె. కావున పరిశీలనగావింపక యేకార్యంబును చేసినను హానికలుగుట నిశ్చయం బింక మీచిత్తంబుకొలఁది సహుప్రుఁ డని చెప్పి బోధవ్యాపకుఁడు చనెను.

---

పిదప నాలవజామున కాపాడువంతుగల బోధ విభీషణుఁ డనువాఁడు కేలను డాలుకరవారులను ధరించి పట్టణం బంతయుఁ దిరిగి నృపశయనమందిర మునకుఁ బ్రదక్షిణముగా వచ్చి రాజసన్నిధిం జేరి నిలిచిన మనుజాధిపుం డిట్లని పల్కెను.

ఓబోధవిభీషణుఁడా! నీచెలి యగు బోధాది త్యుం డాచరించిన పనిని వింటివా? యని తనసతి వానితో మాటలాడినదియు, పిమ్మట తుదకు తల్లీ! నేనుబోధాదిత్యుండనుగదా? యనుటంతముగాఁగల యావద్వృత్తాంతంబును దెలియఁబఱచి యిట్లు యంతఃపురదోహికి నీకుఁ బొడకట్టినశిక్షలలో నొ క్కదానిని నిష్పాక్షికబుద్ధితోఁ దెలుపుమన బోధ

విభీషణుం డిట్లనియె. స్వామీ! బోధాదిత్యుని సుగుణంబు లనంతంబులగుటలోఁ నించు కేని సందియము లేదు. అయితే చెట్టుచెడుకాలమునకు కుక్కమూతిపిం దెలన్నట్లు మహానుభావుఁడగు నాతని కీదుర్బుద్ధిపుట్టి యుండనోపు. కన్నతండ్రి కుపద్రవముం జేయుదుష్టాత్ము లెచ్చటనేనిఁ గలరా? కాఁబట్టి యీవిషయమై పరిశీలనం బొనర్చి తత్కార్యకరణకారణం బెఱింగి తగినదండన విధించుట యుక్తము. లేక తొందరపడి చేసిన పుట్టంధునిమాటల నమ్మి యొకవర్తకుని కిని ఆతనిభార్యకును శిక్షవిధించిన రాజుచందంబున కాఁగలదు. కావున నీకార్యంబు చక్కఁగా విచారించి చేయుఁ డనిన, ఆపుట్టంధునికథ వినవలతుఁ జెప్పుమన నిట్లనియె.



## 3.

బోధవిభీషణుఁడు రాజునకుఁ జెప్పిన

# పుట్టంధుని కథ.

సీతయుక్తిపరిపూర్ణంబయిన మిథిలయను నొక పురంబు గలదు. అందొక బ్రాహ్మణుఁడు శ్వశురగృహంబునఁ గలహించి యవమానితుండై వారల కెదుట నుండుటకు మనం బొప్పక దేశాంతరగమనం॥ నొందుటకు యత్నించినవాఁడై బయలు వెడలి పోవుచుండఁగా, త్రోవలో నొకపుట్టంధుండును, వాని భార్యయుఁ బోవుచుండఁగా నామగువ సౌందర్యవయోయుక్త యగుటం జేసి యవ్విప్రకుమారుండు దానిం గ్రహింపవలయు నను తలంపున కనుసన్నల చేత దానితో నన్నుంగూడ వచ్చెదవా? యని యడిగిన నదియు నతనివయోవిశేషంబును తనపురుషుండగు పుట్టంధునికురూపంబునుం బొడఁగని యతనితోడఁ గూడి పోవుటకు నిశ్చయించినదై పురుషుని జూచి నాథా యిప్పుడిచ్చట నేనొక తేనెమామిడిపండునుం జూచితిం గావున తత్ఫలంబు భుజియింపవలయు నను నభిప్రాయంబు పొడముచున్నది. దానిం గొనివచ్చెద నంతపర్యంత మీప్రదేశమునఁ గూర్చుండియుండు

మని తత్పురంబునకు సమీపముననుండు వనంబుఁ జొచ్చి యందొక వృక్షమూలంబున నా గ్రుడ్డివాని నాసీనుం జేసి పోయివచ్చెద ననిన వాఁడును నేత్ర హీనుఁ డగుటవలన నాబ్రాహ్మణునకును దనపతికిని జరిగిన సంకేతము తెలియంగక మామిడిపండును దీసికొని యతిత్వరితగతిం బర తెమ్మని యనిపిన నా చిత్తినియు నత్యంతాహ్లాదంబునఁ దనదోడును బాసెఁ గదాయని తలంచుచు నావిప్రవర్యునితోడం గూడి మారుబాటగా మఱియొక దేశమున కేగెను. తరువాత నాపుట్టంధుండును గొంతసేపు నిరీక్షించి భార్య రాకపోవుటచే తనను మోసపుచ్చెనని తలంచి యానాఁడు మొదలాఱుదినములు నిద్రాహారములులేక రేయుంబవళ్లు చింతాభరంబునం బొగిలి యీశ్వరా యనుమాటదక్క తక్కినవ్యవహారసిద్ధంబు లగు పల్కులమాని భగవద్ధ్యాననిరతుండై మిగుల సంతాపంబునఁ బ్రొద్దులుపుచ్చుచుండఁగా దక్షిణదేశంబు నందుండి కావేరిసెట్టి యను నొక వైశ్యోత్తముండు పత్నీసహితుండై బంధుదర్శనార్థంబుగా నాత్రోవ లోఁ బోవుచు నీశ్వరాయను నొక యార్తస్వరంబును విని యంత నలుదిక్కులుం బరికించి తత్సమీపంబునంగల వనమధ్యంబున నొక వృక్షమూ

లంబున నాసీనుండై యీశ్వరధ్యానము చేయు చున్న పురుషుంగని యచట నిల్చి చూచి తత్పురుషుఁడు నేత్రవిహీనుఁడని యెఱిఁగి వానివృత్తాంత మడిగి తెలిసికొనఁగోరి యోపుణ్యాత్ముఁడా! నీవీ ప్రదేశంబున నో రెండునట్లీశ్వరధ్యానముఁ జేయుచు నొంటరిగానుండుటకుఁ గతంబేమి? నీ వెవ్వఁడవు? అనియడిగిన నాసెట్టిపలుకులచే పెన్నిధిఁ గనిన పేదచందంబున సంతసించి దైన్యముతో నావైశ్యోత్తమున కిట్లనియె. "అయ్యా! మీ రెవరో నే నంధుండనగుటచే నాకుఁదెలియదు. మీ మాట వినినదిమొదలు నాపాలిటిదైవమె యని తలంచెదంగావున మీ రిపుడు నాకొక యుపకృతిఁ జేయవలయు. మీవంటి దీనరక్షకులు నావంటి పాపిష్ఠునికి లభించుట దైవకటాక్షము గాని యితరముకాదు. నేను పాపిష్ఠుఁడ ననుటకు నాజన్మాంధత్వమే సూచకము. నాదుఃఖమునకు కారణముఁ జెప్పెద వినుఁడు. నేనును నాభార్యయు నీమార్గమున వచ్చుచుండ నన్నిక్కడ నిల్పి యొకతేనె మామిడిపండు పరిపక్వముగా ఫలించియున్నది గావున దానిం దెచ్చువఱ కిచ్చట నుండుఁడని మోసపుచ్చి యెక్కడి కేగెనో తెలియదు. ఇప్పటి

కాఱుదినము లాయెను. గ్రుడ్డివాఁడ నగుటచే త్రోవ తెలియక యీశ్వరునిఁ దలఁచి మొఱవెట్టు చున్నాను. కావున దయామయా! యొకత్రోవఁ జూపి నన్నురక్షింపుఁ” డని కోమటిమాట చాయను నమస్కరించి “అయ్యా! నేను కోరిన యుపకృతి యేమనఁగా, నాయందు కటాక్షముంచి నన్నొకక్రియాశిలోఁ జేర్చిన మీకు సుకృతము గల్గును. పరాధీనుఁడనగు నావంటి యనాథుని రక్షించుటకంటె మిగుల పుణ్యంబు గలదా” యని పలువెఱంగులఁ బ్రార్థింపఁగా నతనిపలుకు లాలకించి యావైశ్యోత్తముండు పశ్చాత్తప్తుఁడై దారిలో భోజనమునకుఁ దెచ్చుకొనినచలిదిమూటవిప్పి వాని క్షుత్తు నివర్తించునటుల భోజనం బిడి ఆయాసము దీర్చుకొననిచ్చి తనభార్యతో నీగ్రుడ్డివానిచేతకఱ్ఱఁ బట్టుకొని నాతో రమ్మని యాజ్ఞాపించఁగా, వైశ్యాంగననాథుని కిట్లనియె. “అయ్యా! ప్రాణేశ్వరా! ఇతని చేతికఱ్ఱను బట్టుకొని నేను బిలుచుకొనిరావడము యుక్తముగా నుండదు. అట్లు నేను తెచ్చితినేని జనులనేకప్రకారములుగాఁ దలంచెదరు. విపరీతముగా నెన్నుదురు. ఇటుల ననేకులు మోసపోయియున్నారు. అయినను మీమాట నతిక్రమించితి నేని నాపతివ్ర

తాత్పర్యమునకు దోషము కల్గును కావున మీరు చెప్పి నట్లుగా మీయిష్టప్రకార మీతనిని పట్టుకొనివచ్చెద నని గ్రుడ్డివానిచేతికఱ్ఱను బట్టుకొని వెంట రాఁగా నా వైశ్యుడు సాయంకాలమునసింహళదేశముననొక పట్టణము ప్రవేశించి యందొకవీధిలో తనజాతీయు లగువైశ్యులగృహంబున నిలిచి యారాత్రి కూడ వంట చేయించి గ్రుడ్డివానికి తుష్టిగా నన్నము నిడి పత్నీసమేతముగా తానును భుజించి పరుండి మరునాఁ డుదయము కాఁగానే, అవతల సాగిపోవు కాలంబున "అప్పా! నిన్నీపట్టణములోఁ జేర్చితిమి. ఇంక మాత్రో వను మేముపోయెద"మని చెప్పఁగా గ్రుడ్డివాఁడు కన్న తల్లిని కలియఁగోరు కృతఘ్నునిమాడ్కి చెడుతలంపు గలవాఁడై కుయ్యోయని యేడ్చి యాగాత్యము చేసి నలుగురు గుంపు గూడునట్లుచేసి యీపట్టణ ములో ధర్మమును విచారించి పాలించు ప్రభువులు లేరా? దుర్బలులయిన మాబోటిపేదలను విచారిం పక దుర్మార్గులు మోసముచేసి పోవుచుండఁగా నూ రకుండుట రాజులకు ధర్మమా? ఇప్పు డీసెట్టివాఁడు నన్ను మోసపుచ్చి నాభార్యను అపహరింపఁ దలంచి నాఁడు. ఆకథ వినుఁడు. మిథిలాపురమునుండి మేము వచ్చుచుండఁగా నితఁడు తండ్రిమొదలగువారితోఁ

గలహించి మార్గమునుబట్టి వచ్చుచుండెడుమాతోం గలిసికొని తనవర్తమానమంతయుఁ జెప్పుకొని యంగలార్చుగా నా కితనియందు కేవలము పశ్చాత్తాపము గల్గి కొన్ని బుద్ధిమాటలు చెప్పి మాకును వెంట మనుష్యసహాయ మున్న బాగుగదాయని కాలము తప్పకుండ అన్నపానములు విచారించుచు ఈస్థలమునకు వచ్చినందులకు నేను కండ్లులేనివాఁడనని యెంచి నాభార్యయు నీతండును నేమేమో మాటలాడుకొని నన్ను దిక్కులేనివానిఁగా జేసి పోవుచున్నారు. ఈరాత్రికూడ తృప్తిగా నన్నము పెడి యిచ్చుటనే పరుండుమని చెప్పితిని. ఇప్పుడు నా కితఁ డీయపకారము చేయఁ దలఁచినాఁడు. అయ్యో! "అని ప్రలాపించుట కారంభించెను. అప్పుడా సమీపవర్తులగు జనులు ఈ సమాచారం బంతయు నాపట్టణమేలు రాజునకుఁ దెలియపరచిరి. రా జావర్తమానమును విని కొందఱు చారకుల నంపి యాముగ్గురిని బిలుచుకొనిరమ్మనియాజ్ఞాపించి, వారు రాఁగానే వారలయాకారములను జూచి,మూఢచిత్తుఁడై యేమియు విచారింపక గ్రుడ్డివాఁడసత్యమునకు లోఁబడఁజాలఁడని నిశ్చయించి కటికవాండ్లను పిలిపించి యీసెట్టివాఁడు దుర్మార్గుఁ

డై గుడ్డివానిభార్య నపహరింపఁ దలఁచినాఁడు కాఁ
బట్టిపీనితలఁ దునుముండని యాజ్ఞాపించి యాతనిభా
ర్యనుజూచి యేనిమిటి కురూపియైనను గుడ్డివాఁడయి
ననుపతివ్రత లగుస్త్రీలు పరపురుషభ్రాంతి నొందరు.
ఈదుర్మార్గులు పరునితోఁ గలసి పోవుటకు యత్నిం
చుటవలన సున్నపుటాల విరియఁ బోయుండని యు
త్తరవుచేసి యంతఃపురంబునకుఁ జనియెను. పిమ్మట
గుడ్డివాఁ డేకాకియై యచట నిశ్శబ్దముగా నుండు
టఁజేసి యితరు లెవరును లేరని తలంచి తనలో నిట్లు
వితర్కించుకొనియెను. ఉపకారుల కపకారముచే
యుటచేత పాపమేకాని మేలుకలుగదు. అరణ్యమునఁ
బడి యేడ్చుచున్న పుణ్యాత్ముఁడగు సెట్టియాఁకలిదీర్చి
యాదరించి యీపట్టణముఁ జేర్చినాఁడు. ఇట్టిసత్పు
రుషుని కీకీడు దలంచుటచేత నేలాభమును కనబడ
లేదు. నేనునాభార్యను సెట్టితీసికొనిపోవుచున్నాఁడని
యాగాత్యము చేసితినేని యావెలఁదిని నన్నుఁగూర్చి
సెట్టినిబెదరించి యనుపుఁగదాయని చేసినందుకు, ఈ
రాజు బుద్ధిహీనుండై వారిరువురిం జంపున ట్లుత్తరు
వుంజేసెను. నేనిట్లుచేయక యింక వేఁడుకొని యుం
టినేని నాకుఁదగిన యుపచారములకుఁ గూడ ఆదరు
వు కలుగజేయుదురే? దైవం బిట్టిదుర్బుద్ధినాకేల గలు

గఁజేసె నని యనుకొను చుండఁగా నచటనుంటిన యూడిగవుజను లాలకించి రాజున కామోహమును తెలియపఱచిరి. నరేశ్వరుఁడామాటలాలకించి "విచారింపక యేకార్యమైనను చేయవచ్చునా? గుడ్డివానిమాటవిని మిక్కిలిపాపహేతుకరమైనకార్యము చేసితిని. ఈపాపము దొలంగునట్టి యుపాయం బెద్దియో, యనివిచారముతోఁ గొలువుకూటంబునకేతెంచి యాజ్ఞ చేసిన వైశ్యదంపతుల తిరుగాఁ బిలిపించి వారికి కొన్ని బహుమానులు చేసి"మీరతిసజ్జనులు పరోపకారులు నగు పుణ్యాత్ములు. మీకీయపకారముఁ దలంచిన పాపకర్మునికి తగినశిక్ష యొసర్చెద. నేను మిమ్ము నవమానపఱచినపాపమునకు లోను గాకుండునటులు దైవమును బ్రార్థింపుఁ"డని మిగుల సన్మానించి యంపినవాఁడై యాయంధుని కొఱఁతవేయించి తత్పాపహరణార్థముగా షోడశమహాదానంబులఁ జేసి యిష్టజనపరివేష్టితుండై సుఖంబున నుండెను. కావున మీరును మీయిష్టులఁగూడి దీర్ఘాలోచనముఁ జేసి యీకృత్యమును బోధాదిత్యుఁ డేకారణమునుబట్టి చేసినది విచారించి మీయిష్టప్రకారము దండనముచేయవలసినదిగాని త్వరపడిలేని

సంతాపహేతువగునని పలికి బోధవిభీషణుఁడు తన గృహంబునకుఁ జనియెను.

---

తరువాత రాజేంద్రుఁడు బోధచంద్రాదుల మాటల నాలకించి నానావిధము లైనయోచనలఁ జేయుచు నేమియుఁ దోఁచక డోలాయమానమాన సుఁడై యుండెను. ఇంతలో సూర్యోదయం బాయెను. పిమ్మట రాజు నిత్యకృత్యంబుల నాచరించి కొలువున కుఁబోయి సింహాసనాసీనుఁడై పూర్వము తనవద్ద నుండిన మంత్రులు మున్నగు నిజపరివారంబులు గొలువ నందఱుం గలయఁ గనుంగొని యోసభాసదులారా! యెల్లరు నాపలుకు లాలకించవలయునని మేఘగంభీరధ్వనులతో క్రోధారుణితలోచనుండై యిట్లని చెప్పందొడంగె. అంతఃపురమున నేను రాణియు హంసతూలికాతల్పంబున సుఖనిద్రం జెంది యుండఁగా బోధాదిత్యుండు గృహంబు సొచ్చి తన చిటికెనవ్రేలితో మత్ప్రియాపయోధరంబుల గాయంబొనర్చి జనుచుండ తెల్విఁదెచ్చుకొని కనులు విప్పి యెవఁడురా? రాజాంతఃపురంబునకుం జను దెంచి యీ యర్ధరాత్రంబున నకృత్యమునకు లోనై చనువాఁడని సింహాంగనమాడ్కి ప్రశ్నింపఁగా తల్లి!

నేను కదా బోధాదిత్యుండ నని మాఱుపల్కి చనియె ను. కాఁబట్టి యిందుకు మీరందఱు చక్కఁగా నా లోచించి తగినశిక్ష విధింపవలయు నని చెప్పఁగా నాకొలువున నుండిన మంత్రివర్గంబునువృద్ధజనంబులు ను పలుదెఱంగుల రాత్రి జరిగినసంగతిఁగూర్చి గుస గుస లాడుచుఁ పలుతెఱంగుల నెన్నుచుండ వారిలో వృద్ధుండును, బహుదినములనుండి యయ్యాస్థానం బునఁ బరిచితుఁడు నగు మనునీతి యను మంత్రిశే ఖరుండు లేచి చేతులు జోడించి మృదుమధురము లగు వచనముల నిట్లనియె.

స్వామీ! నావిన్నపంబు నాలకించ వలయు నని యిట్లు చెప్పఁదొడఁగెను.



వృద్ధిపఱచి యీచెట్టుఫలించినపిమ్మట సపరివారముగా భుజించితినేని చింతలేకయుందునని తలంచి, ఇందు వలన రాష్ట్రములో కీర్తిమంతుఁడనై యుండఁగలవాఁ డ నని యూహించి తోఁటవానిచేతికాపంపునిచ్చి చెట్టుఁ జేసి ఫలించినపిమ్మట ఫలములఁ గొనిరమ్మని యాజ్ఞాపించెను. మఱియు నీచెట్టువిషయములోఁగాని ఫలములవిషయములోఁగాని యజాగ్రతఁ దాల్చితి వేని తగినశిక్షఁ జేసెదనని ఖండితముగా నుత్తరువు చేసెను. ఆతోఁటవాండ్రందఱు భయభక్తులతో రాజాజ్ఞ నొనర్చిరి. చెట్టుఫలించెను. పండినవండ్లను రాజసముఖమున నుంచిరి. ఆపండ్లమాహాత్మ్యమును రాజు తనగురువునకుఁ దెల్పి ఆము వృద్ధులగుటచే సిపండ్లనుభుజించి పూర్ణయౌవనవంతులు కావలయు నని నాకోరికయని యూపండును సమర్పించి భుజింపు మనఁగా అప్పుడే యీఫలముదిని విషముదిన్నవాని వలెనికారముఁ జెంది మృతినొందెను. కుమారా త్వామి చ్చునట్టి ఫలముఁ దినినవాఁడీప్రకారము మృతిజెందు టకుకారణం బేమియన చెట్టు బాగుగఫలించినపిమ్మద నాశాఖపై పండుమీఁద నెలనిడియొక త్రాచుపాము లేయెండసమయమున నెండ కాగుచు ప్రాకుటవలన నావిషము పండునకు సంపర్కముకలిగి యనుకొనిన

ఫలమునకు వ్యత్యస్తఫలము సంభవించెను. ఈసంగతి నాతోఁటవాఁడు తెలియక యాపండునుగూడ సేపండతో కలిపి రాజునకర్పించెను. రాజునకును తెలియక గురున కిచ్చుటచే నాయనమరణించెను. అందువలన రాజు మిగులపరితప్తహృదయుఁడై అయ్యో! సమస్త నీతిధర్మముల నెఱింగినవాఁడనై యీగురుని నొకదుశ్శీలుఁడగు బ్రాహ్మణునిమాటలను నమ్మి వంశవిచ్ఛేదకారణంబగు గురుహత్యనొనర్చితిని. ఎన్నిపుణ్యకార్యంబు లొనర్చినను గురుహత్యవలని పాతకంబువాయుట దుస్తరముగదా? యని చింతించుచుండ పిడుగుపడినవానికిఁ గొరవిఁజూపినమాడ్కిఁ గురుపత్ని రాజసముఖంబున నిల్చి మహారాజా! నాభర్తం జంపితివిగాన నేను సహగమనంబొనర్పవలయు. అట్లు చేయకున్న మత్పాతివ్రత్యంబు దూష్యంబగుం గాన నందుకు సమ్మతిపడితివని నిశ్చితతాంబూలంబొసంగుమనినపలుకులు చెవులకు ములుకులుక్రియఁ దోఁచిన నాపృథ్వీశుఁడో దైవమా! పాముఁగఱచినవానికి పాషాణంబిడినట్లు నావంటి పామరున కీపాతకము గట్టిపెట్టుటతగవా? అనిభగవద్ధ్యానముఁ జేయుచు నేమియు బలుకనేరక క్షణమూరకుండి గురుపత్నీముఖంబునఁజూడ్కులనిగిడ్చి తల్లీ! కన్నపుత్రునియందలిదయఁ

వృద్ధిపఱచి యీ చెట్టుఫలించినప్పుడు సపరివారముగా భుజించితినేని చింతలేకయుందునని తలంచి, ఇందు వలన రాష్ట్రములోకీర్తిమంతుఁడనై యుండఁగలవాఁ డ నని యూహించి తోఁటవానిచేతికాపంపునిచ్చి చెట్టుఁ జేసి ఫలించినప్పుడు ఫలములఁ గొనిరమ్మని యాజ్ఞాపించెను. మఱియు నీచెట్టువిషయములోఁగాని ఫలములవిషయములోఁగాని యజాగ్రతఁ దాల్చితి వేని తగినశిక్షఁ జేసెదనని ఖండితముగా నుత్తరువు చేసెను. ఆతోఁటవాండ్రందఱు భయభక్తులతో రాజాజ్ఞ నొనర్చిరి. చెట్టుఫలించెను. పండినపండ్లను రాజసముఖమున నుంచిరి. ఆపండ్లమాహాత్మ్యమును రాజు తనగురువునకుఁ దెల్పి తాము వృద్ధులగుటచే నీపండ్లనుభుజించి పూర్ణయావనవంతులు కావలయు నని నాకోరికయని యాపండును సమర్పించి భుజింపు మనఁగా అప్పుడే యాఫలముదినిన విషముదిన్నవాని వలెనికారముఁ జెంది మృతినొందెను. కుమారా త్వామి చ్చినట్టి ఫలముఁ దినినవాఁ డీప్రకారము మృతిజెందు టకు కారణంబేమియన చెట్టు బాగుగఫలించినమీఁద నాశాఖపై పండుమీఁద నిలనిడియొక త్రాచుపాము లేయెండసమయమున నెండ కాగుచు ప్రాకుటవలన నావిషము పండునకు సంపర్కముకలిగి యనుకొనిన

ఫలమునకు వ్యత్యస్తఫలము సంభవించెను. ఈసంగతి నాతోఁటవాఁడు తెలియక యాపండునుగూడ సర్పం డతో కలిపి రాజునకర్పించెను. రాజునకును తెలియక గురున కిచ్చుటచే నాయనమరణించెను. అందువలన రాజు మిగులపరితప్తహృదయుఁడై అయ్యో! సమస్త నీతిధర్మముల నెఱింగినవాఁడనై యీగురుని నొకదు శ్శీలుఁడగు బ్రాహ్మణునిమాటలను నమ్మి వంశవిచ్ఛే దకారణంబగు గురుహత్యనొనర్చితిని. ఎన్నిపుణ్యకా ర్యంబు లొనర్చినను గురుహత్యవలని పాతకంబువా యుట దుస్తరముగదా? యని చింతించుచుండ పిడు గుపడినవానికిఁ గొరవిఁజూపినమాడ్కి గురుపత్ని రాజసముఖంబుననిల్చి మహారాజా! నాభర్తంజంపి తివిగాన నేను సహగమనంబొనర్పవలయు. అట్లు చే యకున్న మత్పతివ్రతాత్వంబు దూష్యంబగుం గాన నందుకు సమ్మతిపడితనని నిశ్చితతాంబూలంబొసంగు మనినపలుకులు చెవులకు ములుకులు క్రియఁ దోచిన నాపృథ్వీశుఁ డోదైవమా! పాముఁగఱచినవానికి పా షాణంబిడినట్లు నావంటి పామరున కీపాతకము గట్టి పెట్టుటతగవా? అనిభగవద్ధ్యానముఁ జేయుచు నేమి యు బలుకనేరక క్షణమూరకుండి గురుపత్నీముఖం బునఁజూడ్కులనిగిడ్చి తల్లీ! కన్నపుత్రునియందలిదయఁ

జూపి యపరాధములమన్నింపవలయు. విూ రెద్దికోరి న నద్దానినీయ సిద్ధముగానుంటినని పలువిధంబుల వేడి యూమె నాఘోరమగు నుద్యమమునుండితప్పించెను. పిమ్మట మునుపటికంటె సర్వవిధముల నామెను సత్కరించి ఆమెనుదృప్తిపరచి పిమ్మట గుకుని దేహము చందనకాష్ఠములచే దహనంబొనర్చి తత్ప్రీతిగా గోభూతిలహిరణ్యాదిదానములచేతను బ్రాహ్మణభోజనములచేతను బ్రాహ్మణసంతుష్టిగావించి మామిడిపండును దెచ్చియిచ్చిన బ్రాహ్మణునిరావించి మనోవాక్కాయకర్మంబుల నీకేవిధమైనదోషంబు చేసి యెఱుంగను కదా? విషపు మామిడిపండు తెచ్చియిచ్చుట కేమి హేతు వని రోషముతోనడుగఁగా బ్రాహ్మణుం డిట్లనియె. అయ్యా! నీకు హానినిగోరి యీఫలముఁదెచ్చియిచ్చిన నాపుణ్యలోకంబు లంతరించుగాక ! చిరకాల నరకములు ప్రాప్తించునుగాక! నిక్కమగు నిప్పలుకులాలించు మని యిట్లనియె. సంతతిలేని నేను పంచవన్నెలచిలుక నొకదానిని పెంచికొంటిని. ఆచిలుక యొకనాఁడామామిడిపండునుదెచ్చి దానిభక్షించిన వారు జరామరణవర్జితులగుదురని చెప్ప భిక్షుకుడనగు నేను బ్రతికియుండ ఫలంబులేదనియు, తమబోటి వారు చిరకాలాయుర్దాయముగలవారైన మాబోటి

దీనులకు రక్షకమనియు నెంచి యీపండు నేలిన వారికొసంగితిఁగాన యింతకంటె మఱే మేపాప పుణ్యంబుల నెఱుఁగనని దైవసాక్షిగా ప్రమాణము చేసి నిలచెను. అప్పటికిని రాజునకు నమ్మకము లేక సభ దీర్చి సభాసదులతో నీవృత్తాంతం బంతయు చెప్పి దీనికిఁదగినశిక్షను విధింపుఁడని యడుగఁగా సభ్యు లాలోచించి ధర్మశాస్త్రములఁజూచి యతఁడు తెలి యక చేయుటచే నొకకన్ను పొడిపింపవలసినదని చెప్పిరి. రాజు బ్రాహ్మణునికుడికంటి గ్రుడ్డను పెరికిం చెను. పిమ్మట బ్రాహ్మణుఁ డింటికేగి జరిగినవృత్తాంతం బంతయు భార్యతోఁ జెప్పి చిలుక తెచ్చియిచ్చిన మామిడిపండువలన నింత పుట్టెను గాన నీయంగవైక ల్యకారణమగు నీచిలుకం జంపి వైచెద నని పట్టుకొ నఁగా నాకీరము ఇట్లుచెప్పెను. 'అయ్యా! నేఁటితో మీకును నాకును ఋణంబు చెల్లిపోయెను. మీరు నాయందు పూర్ణవిశ్వాస ముంచి పెంచితిరి. నేనును కపటస్వభావముగలదానను కాను. మీనిష్కాపట్య మునకును, విశ్వాసాతిశయమునకును, ఆచారశీలత్వ మునకును దగినమార్గము నాలోచించి చేసినపనినా భాగ్యానుసారముగా నీలాటియపవాదమును కలుగఁ జేసెను. దైవఘటనము దప్పింప నలువకైనను వశ

షూ! నాకర్మమునకు మీరేమి, చేయుదురు? నేనిప్పుడెన్ని నమ్మకము లిచ్చినను మీకు నాయందు నమ్మకము కలుగదు. నాకు నేటితో నాయువు పండినది. కావున మిక్కిలి పలుకుటచే పనిలేదు. మీరట్లైనను జప్పుటకు నిశ్చయించితిని. అనాయాసముగా ప్రాణములువిడుచునటుల చేసి మనయింటియెదుట నొకగుండము త్రవ్వించి యందగ్ని మంటచేసి నన్ను దహనము జేసి మీదంపతులిర్వురు సుపోష్యముండి రేపటియుదయమున పాలుదెప్పించి సంచయనాదివిధుల నాకన్నియు యథావిధిగాజరిపించి యాగుండమును పూడ్చి తదనంతర మొక బ్రాహ్మణునకు భోజనంబిడి మీరును భుజించి సుఖంబుండుడని బ్రాహ్మణుండును కంటి బాధచే నోపలేకుండక చిలుక చెప్పినరీతిగా సర్వము జరిపించి తత్పాపహరణార్థంబుగా గంగాస్నానమునకేగెను. రాజు శృంగారవనపాలకులతో నీమామిడిచెట్టుఫలం బుపయోగింపనర్హము కాదు. కావున నెవ్వరును దినకుండ కాపుదారిగా నుండవలసిన దనియుత్తరవుఁజేసెను. వారును జాగ్రత్తతో కాపాడుచుండిరి.

కొంతకాల మిట్లు గడచినపిమ్మట ఆపట్టణములో నుండు చాకలివాని తల్లి మిగుల ముదిమిం జెందియుండఁగా దానికోడలు లక్ష్యము సేయక ఉదాసీనంబునఁ

జూచినందున నాచాకిత మనంబున నెరియుచు, ఇంతకాలము సుఖజీవనముఁ జేసి యిప్పుడు లోంగి ప్రతిష్ఠలేక బ్రతుకుటకంటె విషముఁదిని చచ్చుట మేలని తలంచి యావిషమునకై కొన్నియుక్తు లాలోచించి రాజుగారితోఁటలోనివిషవృక్షమున్నందుకు సంతసించి యామామిడిపండు దిని ప్రాణముఁ బాయుటకు నిశ్చయించెను. పిదప వేకువజామున లేచి శృంగారవనికిం జని యామామిడిపండు తన కెట్లు లభించునా? యని చింతించుచుండఁగా మొదట బ్రాహ్మణునిచేఁ జంపఁబడినచిలుక పంచవన్నెలబాసి పచ్చవన్నెచిలుకయై పూర్వజన్మజ్ఞానముతోఁ బుట్టి యాబ్రాహ్మణునికిఁగలిగిన యపవాదమును మాన్ప నెంచి పండినపండు నొకదానిని ముక్కునఁ గరచుకొని వచ్చి యచ్చోట నేలఁబడవైచెను. అంత నాచాకిత సంతోషించి ఇటువైఁ గోడలిదుర్భాషలు తనకుఁ దప్పెనుగదా యని యాపండుమభక్షించెను. తత్క్షణమే యాముదుసలి పదియాఱేండ్లప్రాయము గలదై నిలచి సంతోషమున నుప్పొంగుచు నింటికి వచ్చుచుండఁగా నేదో పనిమీఁదఁ బోవుచున్న కోడలాక్రొత్తమనిషియాకారము దాల్చిన తనయత్తను రెప్పవాల్చకచూచి ముదుసలివై యింతవఱకున్న

నీకీవయస్సురూప మెట్లువచ్చెనని యడుగఁగాజరిగిన దంతయు నాముదుసలి చెప్పెను ఆమాటలవిని ఆశ్చ ర్యపడుచుండఁగా నీమాటలను రాజభృత్యులు విని రాజున కెఱిగించిరి. రాజును సంతోషముతో నాచా కితను బిలువం బంచి కొలుప్రకూటమునకు వచ్చెను. పిమ్మట చాకితవలన వృత్తాంతమంతయు నెఱిగించి యీవార్త నిజమో కాదోయని యొకముదుసలి కైదీని దెప్పించి యాతోఁటనుండి పండ్లను దెప్పించి యాకైదీని దినుమనఁగా కారాగృహవాసముకంటె నాకీచావే మేలని యీపండునుదిని యప్పుడేపదియా ఱేండ్లప్రాయముతో నవమన్మథాకారుఁడై నిల్వఁగా రాజా విచిత్రమునకు సంతసించి సమస్తపరివారము గొల్వఁగొలువుదీర్చి సభ్యులారా! మందబుద్ధినగునేను మహాత్మ్యవిశిష్టమైన మామిడిపండును దెచ్చియిచ్చిన బ్రాహ్మణునికి కన్నువొడిపించి మహాపకారము జేసితిని ఏకార్యముననో గురువులవారుమృతినొందిరి. కార్యా కార్యముల విచారింపక యేపనియుఁ జేయరాదు. నేను విచారణలేకదుష్కార్య మొనర్చితిని కావుననాబ్రాహ్మ ణున కిప్పుడైనను తగిన సన్మానమొనర్చి గౌరవించుట యుక్తమని వేగులవారిని యాపండిచ్చినబ్రాహ్మణుని దీసికొని వచ్చుట కాజ్ఞాపించెను. వారుపిలుచుకొని

వచ్చినతరువాత రాజు ఓభూసురాగ్రణీ! నాయజ్ఞానముచే మీకు నేనొనర్చిన యపకారమును క్షమింపవలయును. సర్వజ్ఞులరగుమీరు మనంబునఁగినిసితిరేని నాకు శ్రేయోహానియగును. మీచిలుకను మీరేమి చేసితిరో నాకు తెలియదు. మీరిచ్చిన పండుమాహాత్మ్యము నాకిప్పుడు తెలిసెను. అనిపల్క రాజునకా బ్రాహ్మణుం డిట్లనియె. "రాజా మీకును నాకును తెలియనికతంబున నిట్లు జరిగె" ననిచెప్పి చిలుకమృతివార్తయు తెలియఁబరచెను. పిమ్మట రాజుచింతించి బ్రాహ్మణునికి కొన్ని యీనాముల నిచ్చి సేలువులు మున్నగునవి బహుమతిచేసి చిలుకమరణమునకై కొన్నిపశ్చాత్తాపవాక్యములఁ జెప్పి యాయనభార్యను బిలువంబంచి యిరువురికి రెండు అమృతమామిడి పండ్లనొసంగి యనుపఁగా వారును శుద్ధమంగళస్నానం బొనర్చి తత్ఫలంబులు దేవునకు నివేదించి యంతట షోడశాబ్దవయస్కులై శుభముహూర్తంబున దంపతులు గలసి తమవయోరూపంబున కనుగుణమగు చక్కనిబాలునిగని శుకానుగ్రహఫలంబునఁ గల్గెనుగాన తన్నామస్మృత్యర్థమై శుకదాసుఁడను పేరిడి సుఖంబుండిరి. పిమ్మట తనరాష్ట్రములోని యందఱికి నీఫలంబులఁ బంచిపెట్టి తానును పత్నీసహితుఁడై

యాఫలంబు నారగించి తన్మాహాత్మ్యంబున నెల్లరు షోడశాబ్దవయస్కులరైరి. పుత్రపౌత్రప్రపౌత్రాదుల ప్రపౌత్రులను గూడఁ జూచి సప్తపురుషులకు మొదటివారై యుండిరి.

---

కావున సవిమర్శకుఁడై రాజు తనప్రాణపదమైన వాని నైనను తప్పుగల్గిన శిక్షింప పెనుదీయరాదు; కావున విచారించి శిక్షింపుమని వక్కాణించెను. అనంతరమున రాజు బోధాదిత్య బోధచంద్ర బోధవ్యాపక బోధవిభీషణుల కొలువునకు రప్పించిబోధాదిత్యా! మే మంతఃపురంబున నిద్రించియుండగా నేమి పని చేసితివని యడుగ బోధాదిత్యుండు శాంతభావమున రాజముఖారవిందముఁజూచి యోరాజశేఖామణీ! యాకటి కన్నంబిడియు నెపము మోచినద్విజుని మాడ్కి నాకు మేలునందుటకై యే యిట్టియపవాదము నొందునట్లయ్యె. నన్నుఁగోపింపక శాంతమానసులరై యాలకించితిరేని తద్వృత్తాంతంబంతయు నెఱింగించెద నన, ఆకటి కన్నమిడి నిందమోచిన బ్రాహ్మణునికథ వినవలయునని మనంబు ముప్పిరిగొనుచున్నది. కాన నయ్యాఖ్యానం బుపక్రమింపుమన బోధాదిత్యుం డిట్లని చెప్పందొడంగె.

---

5

బోధాదిత్యుఁ డలోహేంద్రునకుఁ దెల్పిన

# బ్రాహ్మణుని కథ.

ఈభూమండలమున విజయనగరమనునొక పురవరముగలదు. విజయపాలుం డను రాజుగలఁడు. ఆపట్టణమున కుత్తరభాగమున నొకభద్రకాళిగుడియు నొక తటాకంబును గలదు. ఆతటాకంబు చుట్టును రెండుసారవలుగా వేదిక లేర్పఱచియుండెను. ఆవెంబడిగానుండు సత్పథంబును బట్టి దక్షిణదేశమునుండి యొక బ్రాహ్మణుండు పోవుచుండెను. దగ్గఱనున్న తటాకమును సారవతిన్నెలును వృక్షములును జూచి తనయొద్దకొద్దిగా చల్దియుండఁగా నచ్చట భుజించి విశ్రమించి చనువాఁడై కొలనియొద్ద కేగి తత్తీరమున మూటను దింపి దంతధావనాదికృత్యములాచరించి స్నానముఁ జేయుచుండ నాపొరుగూరినుండి దారపుత్రాదులతో కలహించి పోవుచున్న యొక బ్రాహ్మణుఁ డప్పటికి మూఁడురోజులనుండి తిండిలేకయున్న యాపరదేశియొద్ద నన్నముమూటఁ జూచి యాతనికడనైనఁ గొంచెమన్నమడిగి పుచ్చుకొనుటకెంచి సమీపించి తానును దంతధావనాది

కం బొనర్చికొన నామొదటిబ్రాహ్మణు డీయనం జూచి యాయనవృత్తాంత మడుగంగా, తనభార్యా పుత్రాదులతో తనకుంగలిగినజగడమును దానిపై తాను కోపగించుకొనుటకు కారణము వయసు దప్పి ముదిమిచే నెచ్చోటునకుం బోవుటకును శక్తి లేక ధనము సంపాదింపలేక పోవుటయేయని చెప్పి యో బ్రాహ్మణుండా నీయాహారములోనిది కొంచెము చల్దినాకును బెట్టితివేని, నీకు నూ అశ్వమేధయాగ ములు చేసినఫల మబ్బునని చెప్పి వేడుకొనంగా నామాటలకు మనంబున, జాలిం జెంది యాలాగేస్నా నాదులం జేసికొనిరమ్మనిచెప్పి సగమన్న మొకపటము నందుంచి సగమన్నము దానారగించి యచ్చటివేది కపై గూర్చుండెను. పిమ్మట నా బ్రాహ్మణుడుస్నానసం ధ్యావందనాదికృత్యము లొనర్చి యా బ్రాహ్మణుండు తనకిడిన యన్నము నాయనచే కృతానుమతుండై భుజియించి మృతుండాయెను. అట్లు మృతుండగు టకుకారణంబేమియన నాయన్నమిడిన స్థలంబు నకు సరిగా పైభాగంబున నొకపామును గరుడుండు తన్నుకొని పోవుచుండుటచే పాము విషము గ్రక్కు చుండెను. అందులోనొకబిందు వీబ్రాహ్మణభుక్తమగు నన్నములోం బడెను. అమ్ముదిపాఱుండు భుజించి రెం

సమూఁడురోజులయ్యెను. భుజింపకుండి యాతుర
తతో భుజించి మరణించె ననుకొని నిజకారణము తె
లియక యీదాక్షిణాత్యుండయ్యో! బ్రాహ్మణహత్య
పాపము సమకూడెనే యని చింతించి యామృతవిప్రు
ని విడిచిపోవుట భావ్యంబుగాదనియెంచి కనుచూ
పు మేరలోఁ గనఁబడుచున్న యొక్కగ్రామమునకుఁబో
యియచ్చటి పెద్దలందఱను సమకూర్చి వారితో నీస
మీపముననున్న దుర్గగుడియొద్దనొకవిప్రుఁడుమృతుం
డయ్యె. ఆతనికిపరలోకక్రియలు చేయవలయును,
కావునవచ్చిమీరికార్యంబు నెరవేర్పవలయు నని
న నాద్విజవర్యులెల్లరును గుమిగూడి యాదుర్గగుడి
ముందఱ నేటిగట్టునకు వచ్చి చచ్చిపడియున్న బ్రాహ్మ
ణునిఁ జూచియతనియొద్ద కొంతద్రవ్య మున్నందున
నాతనిఁ జంపియాద్రవ్య మపహరించి నాఁడనియెం
చి యతనినిబట్టిపాశంబులచే బంధించి యాభద్ర
కాళిగుడిలో నొకమూలవైచి యాదేవాలయము
తలుపులను మూసికొని వారివారియుచితస్థానంబుల
కరిగిరి. అప్పుడాబ్రాహ్మణుం డిట్లని వితర్కించెను.
ఉపకారము చేయఁబోయినవారి కపకారము వెంట
నే సిద్ధించును. అనుసామెతచొప్పున నేనిబ్రాహ్మణు
నికిఁ జేసిన యుపకారమునకు నాకిట్టిదుర్దశ వా

టిల్లెనుగదా యని చింతాపరవశుండై యంతఁ దెలివొంది ధీరచిత్తుండయి చతుర్వేదములను షట్ఛాస్త్రములను వాచోవిధేయముగాఁ జదివినవాఁడు కావున భద్రకాళి కంకితముగా గొన్ని కీర్తనలను, నాయగ్రహారపరముగా విషమాక్షరము దుష్కరప్రాసము నిడి కొన్నికీర్తనలను చేసి పాడఁ న నాకాళి యతనిఁగరుణించి బడబాగ్నిరూపము నొంది యాయగ్రహారం బంతయు దహింపఁగా నందలిబ్రాహ్మణు లందఱు గుంపుగూడి యీదుర్గాదేవిగుడికిఁ బోయి యగ్రహారముకాలుటకుఁగారణమును దెలిసికొనవలయునని నిశ్చయించిదాక్షిణాత్యునిఁ గట్టిపడవైచిన గుడివద్దకుఁ బోయిదుర్గను షోడశోపచారములతోఁ బూజించిప్రార్థింపఁగా నామెయొక బ్రాహ్మణబాలునియం దావహించియీ పథికుఁడగు బ్రాహ్మణుండు అచ్చటికి వచ్చుటయు నాతఁడు స్నానాదికృత్యము లాచరించుచుండఁగా నాచచ్చిపడియున్న బ్రాహ్మణుం డచ్చటి కేతెంచుటయు మూఁడురోజులాయెను. నాకు అన్నములేదు కావున నన్నముఁ బెట్టుమని యడుగుటయు, తాను భార్యాపుత్రులతోఁ కలహించి యట్లు నిరాధారముగా వచ్చితినని చెప్పుటయు దానికి బ్రాహ్మణుండు

కనికరించి స్నానముఁజేసి రమ్మనుటయు నాతనికీయున సగపాలుతీసియుంచి వేఱుపటములోనిడుటయు నితఁడువచ్చి భుజించునప్పు డొకపామును గరుడుఁ డొడిసిపట్టుకొని పోవుచుండ పాము విషమును గ్రక్కుటలో నీ బ్రాహ్మణునియాహారములో నొకబిందువు చిందుటయు, అందుచే నాపుత్త్రుఁడు మృతినొందుటయు పాపభీతుండై యీ బ్రాహ్మణుఁడు అగ్రహారమునకువచ్చి యాతనిమరణమును శ్రుతపఱచుటయు చెప్పి యీపుణ్యాత్ముని కిట్టియాపదచేసితిరి కావున నాతఁడు సర్వశాస్త్రముల నెఱింగినవాఁ డగుటచే నాకంకితమిచ్చి కొన్నికృతు లొనరించుటచే నేను మీదుష్కార్యమున కోర్వక యగ్నిరూపముఁదాల్చి మీగృహంబుల దగ్ధంబొనర్చితిని. అనివిశదపఱచగా తాము తమలో తమయుసత్కార్యమునకు చింతించి యీబ్రాహ్మణుని విడిపించి యాతనికందఱు నమస్కరించి తమయపరాధమును మన్నింపు మని ప్రార్థించి చచ్చినబ్రాహ్మణునికి నుత్తరక్రియలు దీర్చి యెల్లరును తమస్థానములకుఁ జనిరి. దాక్షిణాత్యుఁడును స్వేచ్ఛగాఁ జనియెను. కాఁబట్టి యాకవిగురైతెగి యున్నమిడి యిట్టియవస్థ నొందిన బ్రాహ్మణోత్తముని చందమున నాస్థితియు నగుచున్నదనిబోధాదిత్యుఁ డల కేశ్వరుని

కీవిస్మరించి తాను భద్రపఱచి యుంచిన యన్నము బందిఖానాలోనున్న ముదివానికిఁ బెట్టఁగా భక్షించి మృతుఁడాయెను. పిమ్మట విజయనగరమునుండి యమ్ములపొది యుంచినబుంగ వచ్చుటయు సప్తాడాకారాగారమునందున్న రూపవంతుఁడగు మనుజు నొకని రాజువలె శృంగారముచేసి నగరద్వారమునకుఁ బిలుచుకొనిపోయి యమ్ములపొది యుండినబుంగ నాతని ముందిడి దానికమర్చినమూఁత విప్పించఁగా నాబాణాగ్నిచే నాతఁడు మృతుండైనచందంబును పడకటింటిలో రాజుసతీసమేతుఁడై నిద్రించుసమయమున మంచమునకు వేసిన గొలుసుల మార్గమున వచ్చుచున్నపామును రెండుతుండెములుగా నరికి మంచముక్రింద బడవైచుటయు పిమ్మట సర్పమృతిసమయమున రాజపత్నికుచంబున విషపతనం బగుటయు నచ్చటివిషమును కండతో తనచిటికెనవ్రేలివాడిగోటితో తీసివేయుటయు తద్విషనివారణార్థంబును రాజపత్నికుచస్పర్శదోషనివారణార్థంబును చిటికెనవ్రేలినిఖండించుటయును చెప్పి మంచముక్రింద పడియున్న సర్పఖండములును చిటికెనవ్రేలిముక్కయు నతనియెదుట బెట్టించిబోధాదిత్యుం డిట్లనియె. ఓ రాజరాజా! యేలినవారి శయనగృహం బాదిగా

సమస్త ప్రదేశములయందు మేమునల్వురము నాల్గు జాములయందునుతిరిగి వంతుల ప్రకారము నాల్గుజాములుతిరుగుచుండ నందు మొదటిజామున వంతుగల నేను తిరుగునప్పుడొక స్త్రీరోదన మూరిబైటను విన వచ్చెను. నేనాగోదనమగు వంకకుఁబోయి యచ్చట కాళికాలయములో నాధ్వనిని విని యచ్చటికి బోవు నప్పటికి నామెయేరోదనముచేయుచుండెను. వందనములనొనర్చి కతంబడుగఁగా మనరాజునకు అశనంబునను, శత్రువంపినయమ్ముల పొదివలనను, సర్పము వలనను మృతినొందుటయనుమూఁడాపదలు రాఁబోవనున్నవి. ఇట్టిదుర్దశవచ్చుటకునామనంబోర్వక చింతించెదనని యాకాళియానతిచ్చిన నేనాభద్రకాళిచేత మన్ననవడసినవాఁడఁగావున నాయాకాలంబునకుఁ దగుయుక్తులఁబన్ని మేలాచరించితిఁగాని ద్రోహమునెంచలేదు. అట్లుచేయ నెంచితినేని కపటగోహత్యచేసిన పాతకునకైన పాపమె నాకు నగుంగాక! యని పల్కినబోధాదిత్యునింగని మెచ్చుకొని యావజ్జనంబులుపరివేష్ఠింప వారలజూచి రక్షించినవాని భక్షింతున నెడి యొకకథగలదు. దానినివినవలతురేని, చెప్పెదవినుండని యలకేశ్వరుండు చెప్పందొడగెను.



## 6

సభ్యుల కలశేశ్వరుఁడు చెప్పిన

# రక్షించినవాని భక్షించువానికథ

ఉత్తరదేశమున కుశలనాథుండను బ్రాహ్మణుఁడొకఁడుగలండు. అతనికినాల్గువేదములను, షట్ఛాస్త్రములను ప్రతివాఁడును నెఱింగియున్న యార్గురు పుత్రులు గలరు. దైవవశంబున వారుబీదవారై యాయావరవృత్తిచే జీవించుచుండిరి. తండ్రి యాసమీపమున నున్న కొండపైనుండు వెదురడవికిం జని వెదురుబియ్యము సంపాదించి యాబియ్యముచేతను కాలముగడపుచుండెను. కొంతకాలమునకు వేసవి కాలము వచ్చెను. వెదుళ్ళొకదానితో నొకటి రాచుకొనుటవలనఁ గలిగిన నిప్పువలన వెదురడవియంతయు మండుచుండఁగా నావెదురుపొదయందొకపాము ఆవేఁడిమికోర్వఁజాలక కాలకుండనున్న మఱియొక వెదురుపొదపై నెక్కిన నాకార్చిచ్చుదానిం జుట్టుకొనియెను. అప్పు డట్లుపోవుటకు వీలులేక పరితపించుచుండెను. అప్పు డాబ్రాహ్మణుఁడు దయతో నీపామును జూచి "పరోపకారార్థమిదం శరీర"మ్మను బుధవాక్యంబును సంస్మరించి నర

జన్మమెత్తుట యన్యులయుపకృతికే యని తలంచి క్రిందపడియున్న యొక వెదురుకఱ్ఱను బట్టుకొని యాపామునకుఁ దగులునటుల జాచిన వరదబో మెడువానికి తెప్పదొరకినట్లు సంతసించి యా యాధారమున కార్చిచ్చుకు వెలిగా నురికి ప్రాణరక్షకుఁ డని యైన విచారింపక యాతనిఁ గఱచుటకు రాఁగా నాబ్రాహ్మణుఁడు దారపుత్రాదులఁదలంచి దుఃఖించుట కారంభించెను. అప్పు డాపాము "బ్రాహ్మణుఁడా! నన్నీమంటలలోఁబడకుండ ప్రాణంబుల రక్షించితివి; కావున నాఁకాకలియగుచున్న నేనోర్వఁజాలక యుంటిని. నిన్ను భక్షించి నాయాఁకలి దీర్చుకొనియెద"నని చెప్పిన ద్విజుం డిట్లనియె. ఓనాగరాజా! "విషవృక్షోఽపి సంవర్ధ్య స్వయం ఛేత్తుమసాంప్రత" మ్మనియు, "గోబ్రాహ్మణో నహంతవ్యః" అనియు, "ప్రాణదానంబుకన్నను వ్రతముగలదె" యనియు చెప్పుచున్నవిధు లతిక్రమింపఁదగదుగదా? అది యటుండనిమ్ము. విషజంతువవగు నిన్ను కార్చిచ్చునుండి దగ్ధముకానీక కాపాడినందులకు నన్నుఁ జంప నెంచితివి. కాని నీవు చంపెదవని చింతింపను. నాకార్గురుపుత్రులును భార్యయుఁగలరు. వారు నేనిచ్చటినుండి కొనిపోవు వెదురుబియ్యముచే రక్షింపఁబ

డుచుండిరి. నాతండ్రి యెప్పుడు వచ్చుననియు నానాథుఁడింకను రాలేదె యనుచు నెదురుజూచుపుత్రులకును భార్యకును విచారించుచుంటిని. అని చెప్పిన బ్రాహ్మణునిపలుకుల కాసర్పమునకుఁ దయగలిగి నీమనంబటుల నిశ్చయముగా నుండెనేని "యో బ్రాహ్మణోత్తమా! నాశిరోరత్నము నీకిచ్చెద. దానింగొనిపోయి నీదారపుత్రాదులు బ్రతుకుండని చెప్పి వారికి సమ్మతిపరచి నాకాహారార్థముగా నివ్వుమరల నిచ్చుటికి వచ్చెదవా" యన, బ్రాహ్మణుండందుల కంగీకరించి యామణి నిమ్మని యడిగెను. అందుకాసర్పము నీవు మరల వచ్చెదనని ప్రమాణము చేయుమనఁగా "నేనట్లురాక నిలిచితినేని గోహత్య చేసినవానిగతికిం బోవంగలవాఁడ"నని చెప్పి సర్పముచే శిరోరత్నముం గైకొని యింటికి వచ్చి దారపుత్రాదులఁ గని తానరణ్యమున కేగుటాదిగాఁ గలవృత్తాంతంబంతయుఁ జెప్పి తాను చేసియిచ్చిన వాగ్దత్తముం జెప్పి బిడ్డలకును భార్యకును గొన్నినీతులు గఱపి కృతానుమతుఁడై యడవి కేగి సర్పరాజా! నావాగ్దత్తప్రకారముగా నేను వచ్చితిని. ఇంక నీయాఁకలి దీర్చికొమ్మన పాము తనలో నిట్లూహించెను. ఇప్పుడితనిం జంపిన బ్రహ్మహత్యాపాతకంబును ఉపకారము

చేయుటచే మిత్రద్రోహంబును విశేషించి కృతఘ్న
తయు వచ్చుటట్లుండ నేను లోకములో నెన్నిరోజు
లుండఁబోవునది? నిందితుఁడనై బ్రతుకుటకంటె
చచ్చుటయే మేలు. ఇంతకు దేవుఁడు మెచ్చుకొనునా?
కావున ప్రాణదాత యగు నీతనికి నింకను నుప
కారం బొనర్చి పంపెదంగాక యని తలంచి బ్రాహ్మ
ణుని కిట్లనియె. 'అయ్యా! విప్రోత్తమా! నీవు
బ్రాహ్మణుండవు. సర్వవిధములఁ బూజ్యుండవు. చచ్చు
వాని బ్రదికించిన ప్రాణదాతవు. "ఆత్మవత్సర్వ భూ
తాని" యను నీతిరతి నెఱింగిన మహానుభావుండవు!
నీ యార్వురు పుత్రులతోపాటు నన్ను నొక
పుత్రునిగా నెంచి దయ దలంచెదవుగాక. నీ సత్య
మెంతయో చూచుటకు రమ్మంటిని. ఇదె యీరత్న
ముగూడ గ్రహించి నీభార్యాపుత్రాదులతో పో
యినరాజ్యము మరల సంపాదించుకొనిన భూధవుని
మాడ్కి నాకు దత్తంబగు నీదేహంబు పొంది నిర్వ్
చారముగా సుఖించు మనిన బ్రాహ్మణుండు
'అయ్యా సర్పరాజా! నేను చింతనొందుచుంటి నని
యెంచక నామనస్స్ఫూర్తిగా నొసంగిన యీదేహ
మును భక్షించుము. ఎప్పటికైనను వన్నెకురాక కా
షలోష్టమయంబై నిరుపయోగంబగు నీశరీరమునకు

క్షుద్బాధానివారకత్వ మను హేతువుచే నొకపని కుపయోగించు నీదేహమునుదాల్చినందుకు నాకు సంతోషమే?యని యెన్నోవిధములఁ జెప్పినను నాగ రాజం బంగీకరింపక శిరోరత్నము నొకదానిందీసి బ్రాహ్మణుని కిచ్చి నిజేచ్ఛం జనుమని చెప్పెను. పిమ్మట బ్రాహ్మణుఁడు శ్రీమన్నారాయణుని శయ్యా రూపంబగు నాదిశేషుఁడే నాదారిద్ర్యముఁబోఁగొ ట్టుట కిటుల ప్రత్యక్షమయ్యెననిపొగడుచు నింటికేగి యావద్వృత్తాంతంబును భార్యాపుత్రాదులకుం దెల్పి యా మాణిక్యములమాహాత్మ్యమువలన నదిత్యై శ్వర్యసంపన్నుఁడై పుత్రపౌత్రాదులతోఁదులదూగి సుఖంబుండెను. నాగరాజముకూడ నుపకారికి ప్రత్యు పకారముచేసి జన్మము కృతార్థతం జేసికొనినందులకు సంతసించుచు యథేచ్ఛం జనెను.

కాఁబట్టి నేను తత్సదృశముగానె బోధాదిత్యుం డు నన్నురక్షింప నేనతనిఁ జంపింపఁగోరితిని. ఇప్పుడీ సుబుద్ధులగు మంత్రివరులు చెప్పినపలుకులువినుటచే నట్టి పాపకృత్యమునుండి తొలంగితిని. నేను మొద టఁదలంచిన తలంపునకు పాపశాంతి యెట్లగునని తలంచి తానుకట్టించిన సత్రములు చావిళ్లు మున్న గువానియందు బధిర, పంగ్వంధ, భిక్షుక, బహ

చారి, జడి, పరివ్రాజ, కాతిథి, క్షపణ, కావధూత, కాపాలి కాద్యనేకులకు సర్వవిధముల నభ్యంజ నాదిభోజనతాంబూలములవలన తృప్తిపరచి సభ లోనున్న బ్రాహ్మణులకు గోభూతిలహిరణ్యాది దానంబులొనర్చి కృష్ణుని గాఁగలించుకొనిన ధర్మజు మాడ్కి బోధాదిత్యుం గాఁగిలించుకొని యో 'సన్మిత్రచూడామణీ నీవు నాకొనర్చినయుపకారము నకుఁ బ్రత్యుపకారం బేమి సేయఁగలవాఁడ' నని కౌఁగిలించుకొని యనేకాభరణంబులను చీని-చీనాంబరముల నొసంగి మణిమయకిరీటం బొసంగి యానందముతో సంతతిపురంబునకుంజని రాణితో వృత్తాంతంబంతయు నెఱింగించి బోధాదిత్యుఁ డాదిగా మంత్రిపురోహిత సామంత విద్వజ్జన వందిగాయక నటవిట ఆటవికాదిసమస్తజనంబులను సేవింప తారా మధ్యవిరాజితుండగు చంద్రునిమాడ్కి ప్రకాశించుచు ధర్మమార్గంబుదప్పక రాజ్యపరిపాలనం బొనర్చుచు సుఖంబున నుండినవాఁ డాయెను.

చతుస్సచివాఖ్యానంబను పేరంబరఁగిన బోధాదిత్య, బోధచంద్ర, బోధవ్యాపక, బోధవిభీషణు లను నలుగురుమంత్రులచరిత్రము ముగిసెను.

---

క. పటుత ష్టాగివంటులపైఁ
బదియూఱవయేట దీని వావిళ్లకులాం
బుధిమణి యచ్చొత్తించెను
ఇది యారవి వెలయు వెంకటేశ్వరుఁ కృపచేన్.



చెన్నపురి : శ్రీరామప్రెస్సున ముద్రితము.—1925.